# శ్రీ రామాయణ గానసుధ

## (అయోధ్యకాండము)



# శ్రీ రామాయణ గానసుధ

## (అయోధ్యకాండము)




గ్రంధకర్త

''కళారత్న''

శ్రీ పంతుల లక్ష్మీనారాయణరావు

విశాఖపట్నం

# Sree Ramayana Ganasudha
## (AYODHAYA KANDAM)

By "KALARATNA" "PAVANI SUNDARA GANA LOLA"
PANTULA LAKSHMI NARAYANA RAO

Published 21-4-2002 (Sri Rama Navami)

No of copies 1000



Books Available at "Kalaratna" P.L NARAYANA RAO
"Sri Rama Maruti"
D No 43-7-32, Rly New Colony,
Visakhapatnam - 530 016
Phone 561603

**Price Rs. 45-00**

Printed at
SARVANI PRINTERS
48-12-9, Srinagar, Visakhapatnam Ph 755320

కృతికర్త దంపతులు



శ్రీ పి యల్ నారాయణరావు శ్రీమతి గిరిజాకుమారి



గ్రంథకర్తకు ''పావని సుందరగానలోల'' బిరుదు ప్రదానం గావిస్తున్న
ప్రముఖులు శ్రీ డి వి సుబ్బారావు నగర మేయరు,
డాక్టర్ మద్ది గోపాలకృష్ణారెడ్డి, Vice Chancelor A U
కళాప్రపూర్ణ జి అమ్మృత రామరాజు, అధ్యక్షులు విశాఖసాహితి



ఆంధ్ర విశ్వవిద్యాలయం డైమండ్ జూబ్లీ సందర్భంగా శ్రీ ఎమ్ ఆర్ అప్పారావు
గారిచే సన్మానింపబడిన గ్రంథకర్త పి ఎల్ నారాయణరావు,
''కరుణశ్రీ'' జంధ్యాల పాపయ్యశాస్త్రిగారితో



''కళాభినేత్రి'' జమునా రమణారావుగారితో
గళం కలిపి పాడుతున్న గ్రంథకర్త



24 గంటల ఘంటసాల ఆరాధనోత్సవములో
కళాబంధు శ్రీ టి సుబ్బరామిరెడ్డి, ఎం పి గారిచే జ్ఞాపిక బహూకరణ (1998)



నటసామ్రాట్ డాక్టరు అక్కినేని నాగేశ్వరరావు గారి దగ్గర నుండి మద్రాస్
తెలుగు ఎకాడమీ జ్ఞాపికనందుకుంటున్న గ్రంధకర్త



1998 అక్టోబరు 2, గాంధీజయంతి సందర్భముగా ఘంటసాల కల్చరల్
అసోషియేషన్ (తోకాడ) వారి తరుపున గౌ॥ ఎందారు సత్యన్నారాయణ,
పురపాలక పట్టణాభివృద్ధి మంత్రిచే గ్రంధకర్తకు సన్మానం



తేది 28-12-98 విశాఖరత్న వారిచే 'కళారత్న' అవార్డు అందుకుంటున్న
గ్రంథకర్త శ్రీ పి ఎల్ నారాయణరావు

# అయ్యయో! అయోధ్యారాములు



కళాప్రపూర్ణ
**డా॥ గణపతిరాజు అచ్యుతరామరాజు**

శ్రీ మద్రామాయణ మహాకావ్యాన్ని గానసుధ రూపంగా మనకు అందిస్తున్న మిత్రులు శ్రీ పంతుల లక్ష్మీనారాయణరావు గారు రాష్ట్రప్రఖ్యాత పండితవంశంలో కీ॥శే॥ ''సహజకవి'' పంతుల చినజోగారావు, కీ॥శే॥ సుభద్రమ్మ పుణ్యదంపతులకు జన్మించారు. పంతుల చినజోగారావు గారి శ్రీమద్రామాయణ పారిజాతంలో ఇప్పటికి ముద్రితాలయిన బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందరకాండలు విద్వజ్జన ప్రశంసలందుకున్నాయి - ఆయన మరణానంతరం 'సహజకవి' బిరుదాన్ని ఆయనకు సమకూర్చాయి - ఆయన రామాయణ పారిజాతంలోని యుద్ధకాండ ప్రస్తుతం ముద్రణలో ఉంది

పంతుల వంశపూర్వజులలో పార్వతీపురం జమీందారు ధనంజయ ధాత్రాజు ఆస్థానంలో కవిసార్వభౌమ బిరుద సత్కారం పొందిన ''ఇందుమతీ పరిణయ ''శృంగారప్రబంధ కర్త పంతుల బ్రహ్మదేవ కవిగారి ప్రసిద్ధి సాహితీ చరిత్రకారులు

ఉగ్గపించారు వన్నెయూ, వాసియూ కలిగిన ఆవంశంలో కవి గానే కాక మహారామభక్తునిగా ప్రస్తుతులందుకొన్న చినజోగారావుగారి పుత్రునిగా అనువంశిక దైవభక్తి, సాహిత్యాను రక్తిగల శ్రీ లక్ష్మీనారాయణ రావు గారు గాన కోవిదునిగా కూడ వినుతికెక్కారు - వారిమిత్రులాయన గానంలో శతాబ్దపు రాష్ట్రామరగాయకులు ''ఘంటసాల పోకడలను, శ్రావ్యతనూ, గంభీర గాత్రాన్ని స్ఫురణకు తెచ్చుకుంటారు - ఒక ప్రభుత్వ సంస్థలో ఉన్నతోద్యోగాన్ని ధర్మవిహితంగా నిర్వహిస్తూ విశ్రాంతి సమయాల్లో అవిశ్రాంతంగా వందలాది సాంస్కృతిక సంస్థల కార్యక్రమాలలో పాల్గొని వేల సంఖ్యలో ఆంధ్రలోనే గాక ప్రవాసాంధ్ర ప్రదేశాలలో కూడా గానకచ్చేరీలు చేసారు. ఎన్నోసన్మానాలూ సత్కారాలూ పొందారు ''అభినవఘంటసాల'' ''కళారత్న'' పావనిసుందర గానలోల'' వంటి బిరుదులతో సత్కరింపబడినారు

పితృదత్తమైన ఒక భక్త్యావేశంలో తండ్రిగారి అడుగు జాడల్లో రామాయణ గానరచనం కావించారు తండ్రిగారు నిర్వచన పద్యగ్రంథంగా రచింపగా, ఈయన జన సామాన్య ప్రయోజన దృష్టితో అలతి అలతి పదాలతో శ్రీమద్రామాయ ణాన్ని గేయకావ్యంగా మలిచారు - ఇదవరలో ''శ్రీపావని సుందరగాన సుధ'' పేరిట సుందరకాండాన్ని ప్రచురించారు. అది పండిత పామరజన అపార ఆమోదాన్ని పొందింది. ఇప్పుడు రామాయణంలోని తక్కిన కాండల్ని గేయరూపంలో ఒక్కొక్కటిగా అచ్చువేయిస్తున్నారు ఇవి అన్నీ విశాఖసాహితి

ప్రచురణలుగా వెల్వరించడం ఒక సౌజన్య చిహ్నం - అది విశాఖసాహితికి గల ప్రతిష్ఠ.

ఇది శ్రీమద్రామయణ గానసుధ - అయోధ్యకాండము చిరంతనంగా అయోధ్యనగరం జగత్ప్రసిద్ధ నగరం - ఇటీవలి రాజకీయ, మతపర వివాదముల వరకు మాత్రమే కాక భావి తరముల అనుభోగము వరకు కూడ అది చిరస్థాయిగా నిలువగలదు

అయోధ్యా మధురా మాయాకాశీకాంచీ అవంతికా పురీ ద్వారవతీ చైవ సప్తైతే మోక్షదాయకాః అని ముక్తి ప్రదాలైన ఏడు నగరాలుగా పూర్వులు చెప్పారు.

ఆయోధనములో ఓడించుటకు సాధ్యముకాని నగరం అది. ఆయోధనం అనగా యుద్ధం - యుద్ధభూమి. అయోధ్యను సాకేతపురం అనికూడ అంటారు - ప్రస్తుత ఉత్తరప్రదేశ్‌లోని ఫైజాబాదు నగరహద్దులలో పాడైన యాత్రాస్థలంగా ఉన్నది. అయోధ్య, సాకేత పురాలు రెండూ సమీపనగరాలనీ అవి కొన్నాళ్ళకు కలిసిపోయి అయోధ్యగా వర్తిల్లాయని అంటారు రఘుమహారాజు కాలం నాటికే ''పితురనంతర ముత్తరకోసలం'' అని కాళిదాసు వ్రాసినదానిని బట్టి, ఆనాటికే కోసలం అయోధ్య రాజధానిగా గల ఉత్తరకోసలం అని స్పష్టపడుతున్నది. దక్షిణ కోసలం అనగా మహాకోసలం అని ప్రసిద్ధికెక్కిన ప్రాంతం ఆ ప్రాంతాన్నే బౌద్ధ గ్రంథాలలో తోసలగా పేర్కొన్నారు

శ్రీరామునికి పిదప అయోధ్య క్షీణించి రాజధాని స్థితిని పోగొట్టుకుంది. ఒక యాత్రాస్థలంగా మారింది - ఆపిమ్మట

వాసిని ఋషభరాజు పునరుద్ధరించాడనీ, నలమహారాజు కాలం నాటికి ఋతుపర్ణుడనేరాజు ఇచ్చట నుండి రాజ్యమేలుతూ ఉన్నాడనీ, పాండవుల కాలంనాటికి ఋతుపర్ణుడనేరాజు ఇచ్చట నుండి రాజ్యమేలుతూ ఉన్నాడనీ, పాండవుల కాలంనాటికి మహాబలశాలి అయిన దీర్ఘయుగ్యుడు ఇక్కడ రాజ్యం చేస్తున్నాడనీ తెలియవస్తున్నది

జైనులకు కూడా అయోధ్య పరమ పవిత్రస్థలం - వారి ప్రథమ తీర్థంకరుడు ఆదినాదుడు, క్రమంలో రెండవ, నాల్గవ ఆరవ తీర్థంకరులు అజితనాధ, అభినందనాధ, సుమంత నాధులిక్కడేజన్మించారని చరిత్ర

ఈ అయోధ్యలోనే బుద్ధభగవానుడు కొన్నాళ్ళువసించి తన సిద్ధాంతములను బోధిస్తూ ఉండేవాడని, అప్పటి ఈ నగరం పేరు సాకేతపురమనీ బౌద్ధగ్రంధాలవల్ల తెలుస్తుంది.

విక్రమాదిత్యుడనే రాజు ఒకడు అయోధ్యను తిరుగ కట్టించి, నాగేశ్వరనాధ శివాలయాన్ని పునరుద్ధరించాడని జన శ్రుతి

క్రీ॥శ॥ 4 శతాబ్దినాటికి సముద్రగుప్తుడు (300-374) ఆ పిమ్మట ఆయనకుమారుడు అయోధ్యనుండి తమ రాజ్యాన్నేలారని చరిత్ర

అయోధ్యానగరం తూర్పున ప్రస్తుత రామ్ ఘట్టము మొదలు పడమటి గుప్తార్ఘాట్ వరకూ ఆరుమైళ్ళు పొడవు ఉండేదిట - 1940 క్రీ॥శ॥నాటికి అయోధ్య సరిహద్దులలో

ఏడువైష్ణవ మఠాలతో కలిసి 96 హిందూదేవస్థానాలూ, ఆరు జైనమందిరాలూ, 36 మశీదులూ ఉన్నాయి అలనాటి అయోధ్యా దుర్గంలో అనగా నేటి రామ్‌కోటలో శ్రీరామజన్మస్థానం, శ్రీరామ పరిపాలనా కాలంలో కట్టించిన హనుమాన్, జాంబవంత, సుగ్రీవాది బురుజులు ఇరవై ఉండేవని చరిత్ర యాత్రికులకు కన కభవనం, రత్నభవనం మొదలైన రామమందిరాలూ, 1940 నాటికి మూడులక్షల విలువచేసే బలీలు బేగం గోరీ అనేవి దర్శనీయ స్థలాలుగా ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం మొదటి భాగం చెబుతోంది.

రామాయణ ఇతిహాసంలో కొన్ని కాండలూ కొన్ని సర్గలూ, ప్రక్షిప్తాలని అనగా తర్వాత చేర్చబడినవని సాహిత్య, చారిత్రిక పరిశోధకులు అభిప్రాయ పడ్డారు - వాల్మీకి రామా యణంలోని మొదటి కాండా, ఏడవకాండం, తక్కిన కాండ ల్లోని కొన్ని సర్గలూ కాలక్రమాన చేర్చబడ్డాయనీ, అవి ఏవో సాంఘిక, మతపర, రాజకీయ కారణాలవల్ల అలాజరిగి ఉండ వచ్చుననీ అభిప్రాయ పడ్డారు. అయినా అయోధ్య కాండలోని ప్రధానభాగాలు చారిత్రిక సత్యాలు అయివుండవచ్చునని వారు నిర్ధారించారు.

లాంగ్మన్స్ ఇండియన్ క్లాసిక్స్ ''రామాయణ''లోని పీఠి కలో CHANNING ARNOLD వ్రాసిన కొన్ని ముఖ్యాంశాలను తెలుగులోకి స్వేచ్ఛగా అనువదించుకుంటే ''అయోధ్య నేలిన సూర్యవంశపురాజుల చరిత్ర ఆధారంగా రామాయణ ఇతిహాసం నిర్మింపబడిందనీ, ఋగ్వేదంలోనే ఇక్ష్వాకు, దశరథ, రామ

అనే పదాలు కన్పించడంచేత వాల్మీకి రచనకు ఉపక్రమింపక పూర్వమే కొన్ని శతాబ్దాలనుండి రామాయణ గాద ప్రచారంలో ఉండి ఉండాలి అనీ నిర్ధారణ అవుతుంది.

వాల్మీకి రచించిన అయోధ్యాకాండంలోని ఘట్టాలు ఆయన క్రీస్తుపూర్వం 500 (5వ శతాబ్దిలో) రచించాడని తలచినా, ఆసన్నివేశాలన్నీ సుమారు క్రీ॥పూ॥ వెయ్యేండ్లనాటివి కావచ్చు ననీ, జనశ్రుతంగా వచ్చిన ఆరామరాజు చరిత్రను ఆయన కావ్యంగా రచించాడనీ తెలియవస్తున్నది రామపట్టాభిషేక విఘ్నమూ, ఆయనకు జరగవలసిన పట్టాభిషేకాన్ని భ్రష్టంచేసి అరణ్యవాసానికి పంపడమూ అన్నపూర్వభాగం చాలావరకు యదార్థం కావచ్చుననీ, తిరిగి వచ్చి అభిషిక్తుడు కావడం కూడా సత్యమే కావచ్చుననీ, కిష్కింధా, సుందరకాండలూ, యుద్ధ కాండల్లోని కొన్నిభాగాలూ కొన్ని అభూతకల్పనలతో నింప బడ్డాయనీ పరిశోధకులు అభిప్రాయపడ్డారు

వైదికయుగపు ధర్మప్రతిపాదనం, ధర్మపాలనం, విహిత విధులూ రామాయణంలో లక్షణప్రాయంగా కన్పిస్తాయి-హిందూ దేశపు ధర్మధీరులు అందులోకన్పిస్తారు అట్టి లక్ష్యలక్షణాలను ఆవిష్కరించే ప్రధానమైన, కీలక ప్రాయమైన కాండం అయో ధ్యకాండం - శోక సంతప్తులైన కౌసల్యాలక్ష్మణుడు, ప్రజలు, ఇలా ఎందరో రామ పట్టాభిషేకానికి విఘ్నం వచ్చింతర్వాత అతనికి అనుసరణీయ మార్గాలుగా సూచించినవాటిని నీర క్షీరన్యాయంగా ఎలా విశ్లేషించింది గమనిస్తే రాముని పితృవా క్యపాలనం, ధర్మనిరతి, స్థితప్రజ్ఞ రమణీయంగా కన్పిస్తాయి.

ఆయన ధర్మవిగ్రహావిష్కారం లోకానికి అయోధ్య కాండలోనే తెలియవస్తుంది.

మనుస్మృతి ద్వితీయాధ్యాయములో 225 శ్లోకము "ఆచార్యో" బ్రహ్మణో మూర్తిః పితామూర్తిః ప్రజాపతేః, మాతా పృదీవ్యా, మూర్తిస్తు భ్రాతాస్వోమూర్తిరాత్మనః" మొదలుకొని

230వ శ్లోకం "తఏవహి త్రయోలోకా
తఏవత్రయ ఆశ్రమాః
తఏవహి త్రయోవేదాస్త
ఏవోక్తాస్త్రయోగ్నయః"

అలాగే తండ్రి గార్హపత్యాగ్ని, తల్లి దక్షిణాగ్ని ఆచార్యుడాహవనీయాగ్ని అనీ, ఆ అగ్నిత్రయముస్తుత్యర్థమనీ చెప్పిన 231 శ్లోకం

ఆతదుపరి శ్లోకాలలో మాతృభక్తిచే భూలోకాన్నీ పితృభక్తిచే అంతరిక్షలోకాన్నీ గురుశుశ్రూష చేత బ్రహ్మలోకాన్ని పొందవచ్చుననీ - ఆ ముప్పురుకీ జీవితపర్యంత ప్రీతినీ, హితాన్ని చేస్తూ శుశ్రూష చేయవలెననీ ఉన్నది

అయోధ్యనగరం మొట్టమొదట మనువు చేతనిర్మింపబడిందని ప్రతీతి - మనుధర్మ శాస్త్రం శ్రీభృగుమహర్షిచేత చెప్పబడింది "ఆ మనుధర్మ రహస్యం ఎల్లవారికిం తెల్లంబగునట్లు" అస్మదంకితముగ మామకాభిలషిత రీతి నొక గ్రంధమొనరించు ప్రీతినుంటి రది మనుస్మృతి వివరణమాంధ్ర

భాషచే రచింపు డెల్లరును హర్షించునట్లు'' అని విజయనగర మహారాజు ఆనందగజపతి తన ''సంస్థాన స్థిత పండిత వర్యులగు బ్రహ్మశ్రీ మండాకామేశ్వరశాస్త్రులవారిని కోరి ''మేధాతిథి, గోవిందరాజ, కుల్లూకభట్ట నందన రామచంద్ర రాఘవేంద్రకృత వ్యాఖ్యా షట్క సహితంబుగా ముద్రితంబగు పుస్తకం'' ఇచ్చి తన ''అభిప్రాయంబని ఆజ్ఞాపింపగా శ్రీ కామేశ్వరశాస్త్రిగారు ఆంధ్ర మన్వర్థ దీపిక అనే వ్యాఖ్యతో దానిని తెలిగించారు. అది 1893లో చెన్నపురి శారదాంబా విలాసముద్రాక్షరశాలలో ముద్రింపబడింది.

ఆ మన్వర్థదీపిక సహాయంతో శ్రీ మద్వాల్మీకి రామాయణాన్ని చదువుకుంటే ఎంతో విజ్ఞాన సముపార్జనే చేయవచ్చును. అయోధ్య కాండలోని ధర్మసూక్ష్మాలన్నీ ఎంతో విశదంగా చెప్పవచ్చును. కాని పీఠికా విస్తరభీతి

మనుస్మృతిని తలచుకొనగానే ఇంకొక విశేషం గోచరిస్తుంది. - అయోధ్యనగరం మనునిర్మితం - అనగా రాముని వంశమూల పురుషుడైన మనువుచేత నిర్మింపబడింది రామునిది సూర్యవంశం.

పద్మ కల్పాంతంలో నారాయణుని నాభి కమలాన బ్రహ్మ ప్రకటితుడయ్యాడు ఆయన మానసపుత్రులలో మరీచికి కశ్యపుడు జన్మించాడు- అతనికి అదితియందు వరంవల్ల మార్తాండుని వంటి వివస్వంతుడు ప్రభవించాడు. అతనికి వైవస్వంతుడు పుట్టి మన్వంతరాధిపతియై ఇక్ష్వాకుని కన్నాడు. లతనికి నూర్గురు పుత్రులు బహ్వన్వయ కర్తలయ్యారు. వారిలో

కుక్షి అనేరాజువంశంలో హరిశ్చంద్ర, సగర, దిలీప, భగీరథ, కకుత్స్థ, రఘు, దశరథ, రామచంద్ర, కుశాదులు ''అనన్యసామాన్య లోకోత్తర ప్రతాప తపో యజ్ఞ దాన, ప్రజాపాలనాది కృత్యంబుల నిత్యంబగు ప్రతిష్ఠ నలరి రట్టి రాజవంశపరంపర మనునిర్మితంబగు అయోధ్యా పురంబురాజధానిగా ఏలుచుండిరి'' అని శ్రీమండకామేశ్వర శాస్త్రిగారు కృతీశ్వరులగు ఆనందగజపతి వంశానుచరితంలో తెలియపరచారు వైవస్వత మనువు కాలంనుండీ పైని చెప్పినరాజ పరంపర చరిత్రమెట్టిదో పాఠకులకు తెల్లమయిన విషయమే - కాబట్టి శ్రీరాముడు పితృవాక్యపాలనమే కాదు - వంశప్రతిష్ఠా ప్రజ్జ్వలనం కూడా చేసాడు మనువుచే నిర్మింపబడిన అయోధ్య అది. వేదధర్మ ప్రతిపాదనం చేసిన మనుధర్మ పాలనం కూడా లోకోత్తరంగా చేసాడు - ఆయన జీవనవిధానం దానికి మహాభాష్యం. ప్రపంచసాహిత్యంలో రామాయణ స్థానం, దాని ప్రశస్తిగురించి.

*While speakıng of Ecco Homo -*

*"Gods are gods and we feel lıttle ınterest for them, ıf they do not share ın our sorrows and joys"*

*"Every step of the story teaches a lesson In every lıne almost the conduct of Rama sets an example for all tıme"*

ప్రపంచసాహిత్యంలోనే రామాయణ ఇతిహాసంలోని ప్రధాన పాత్రలస్థానం గురించి Channıng Arnold అనే పాశ్చాత్య పండితుడు Longman's Classıcs పీఠికలో వ్రాసిన వాక్యాలు

యధాతదంగా వ్రాయడం ధర్మం అనుకుంటున్నాను

"The chief characters have long been assured an immortal place in the world literature The character of Rama without Question one of the most beautiful ever drawn He is today what for countless centuries he has been the Hindu ideal of noble manhood, and with such art and grace and skill has the ancient Hindu poet painted him that he is not an ideal for India only, but for all the world, for all who read of his tenderness, his loyalty and filial obedience"

About sita he says

"In all literature it would be impossible to find a more beautiful female character than hers Her adoring love for her husband, her wifely devotion in sharing hardships of his Jungle life, her purity and nobility of nature, her unftinching loyalty, her superb courage in her defiance of Ravana her spotless chastity and her patience and gentleness under Injustice and suffering combine to paint as noble a woman's character as the human race has ever known and revereneed - Sita is the perfect wife, perfect daughter and periect woman"

రామాయణ అయోధ్యకాండలోని ధర్మ సూక్ష్మాలన్నీ సామాన్యులకు కూడా తెలియాలంటే శ్రీ పంతుల లక్ష్మీ నారాయణరావు గారి రామాయణ గానసుధ చదివితే చాలు ఆయన గానం చేయగా వింటే మరీ మంచిది ఆయన ఇతర రచనల వలెనే ఇది కూడా బహుళ జనామోదం పొందగలదని నా ఆకాంక్ష - ఆయన పావనీరాముల భక్తి వృధాకాజాలదని నా నమ్మకం



## నా గురించి

కీ.శే ''సహజకవి'' పంతులచిన జోగారావు, కీ॥శే॥ సుభద్రమ్మల పదకొండుమంది సంతానంలో నేను మూడవ వాడిని నా తండ్రిగారు ''శ్రీమద్రామాయణపారిజాతం'' అను నిర్వచనోత్తర రామాయణమును రచించి దానిని శ్రీ భద్రాద్రి రామ చంద్రులవారికి అంకితముగావించి, వారి జన్మచరితార్థము జేసి కొనినారు.

చిరుతప్రాయంలో మా తండ్రిగారు నాచేత క్షుణ్ణంగా ''పెద్ద బాలశిక్ష'', అనేక కవులు వ్రాసిన శతకాలు చదివించారు. కాస్త జ్ఞానం వచ్చాక మా తండ్రి గారి పుస్తక భాండాగారంలో నున్న అనేక గ్రంధాలు చదివే అవకాశం కలిగింది. క్రమేపి తెలుగునుడి కారం మీద మక్కువ ఎక్కువయింది ఈ మక్కువే నన్ను విద్వాన్. శ్రీ దివాకర్లరామమూర్తిగారికి, ఉభయ భాషా ప్రవీణ శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణ శాస్త్రి గారికి, శ్రీచర్ల గణపతి శాస్త్రి గారికి, ''కళాప్రపూర్ణ'' గణపతిరాజు అచ్యుతరామరాజుగారికి దగ్గరచేసింది వారి అవ్యాజమైన ప్రేమాశీస్సులు పొందగలిగే అవకాశం కలుగ జేసింది

3. నా 7సం॥ల వయస్సులో గానగంధర్వ, పద్మశ్రీ ఘంటసాల గారు ''లైలామజ్ను'' చిత్రంలోపాడిన ''పయనమ యే ప్రియతమ ననుమరచిపోకుమా'' అనేపాట నాహృదయంమీద చెరగని ముద్రవేసి అతనికి ఏకలవ్యశిష్యునిగా జేసింది నాకు గానం మీదగల మక్కువ జూసిన నా తల్లిగారు నన్ను అమితంగా ప్రోత్సాహించేవారు ఈనాడు 40 సం॥రాలుగా లలితసంగీత

గాయకునిగా వెలుగొందడానికి ప్రోత్సాహించిన నా తల్లిగారికి, తెలుగులోని కమ్మదనాన్ని ఆస్వాదింపజేసిన నా తండ్రిగారికి, నన్ను కవిగా తీర్చిదిద్దిన నా గురువులందరికీ నేను ఎంతో ఋణపడి ఉన్నాను

నేను మొట్టమొదటిసారిగా ఆగష్టు 15, 1957న పోర్టు జింఖానా దగ్గర కచేరీ చేశాను ఆ తరువాత 1958 అక్టోబరు నెలలో అంతర్ కళాశాల పాటలపోటీలో ఉత్తమ గాయకునిగా ఎన్నికకాబడి అంతర్విశ్వవిద్యాలయాల యువజనోత్సవాలలో పాల్గొనుటకు ఢిల్లీవెళ్ళి నాటి భారతప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, బాబూ జగజ్జీవన్‌రామ్, బూర్గుల రామకృష్ణారావు మున్నగు ప్రముఖులముందు గానంచేసి వారి ఆశీస్సులు అందుకున్నాను తిరిగి 1968వ సంవత్సరంలో ఆంధ్రవిశ్వవిద్యాలయంనుండి ఉత్తమ గాయకునిగా ఎన్నికకాబడి, ఢిల్లీలో జరిగిన కామన్‌వెల్త్ దేశాల యువజనోత్సవాలలో పాల్గొని నాటి రాష్ట్రపతి శ్రీ వి వి గిరి వారి సతీమణి శ్రీమతి సరస్వతీగిరి వారి కుమారులు శ్రీ శంకర్‌గిరి మరికొంతమంది ప్రముఖులముందు రాష్ట్రపతి భవనంలో పాడి వారి అవ్యాజమైన ప్రేమకు నోచుకున్నాను. నాటినుండి నేటివరకు ఈ 42 సంవత్సరంలలో పలు ఆర్కెస్ట్రాల సహకారంతో ఆంధ్రలోను, ప్రవాసాంధ్ర ముఖ్యపట్టణములలో 3000 పై చిలుక లలితసంగీత కచేరీలు చేసే అదృష్టానికి నోచుకున్నాను

1982లో ఉద్యోగరీత్యా నాకు కొన్ని చికాకులు ఎదురై జీవితంమ్మీద విరక్తి కలిగినపుడు, ఒక మిత్రుని సలహాపై శ్రీ ఆంజనేయస్వామివారి పాదాలను ఆశ్రయించాను నాటినుండి ఆయనే నా ఆరాధ్య దైవం, ఆయనే తల్లి, తండ్రి, గురువు స్వామి

వారి ఆదేశమో, మహిమో ఒకరోజు శ్రీ సీతారాములకళ్యాణ ఘట్టాన్ని గానరూపంలో వ్రాయగా, అది చదివిన వారు నన్ను ప్రోత్సహించి మొత్తం రామాయణాన్ని గాన రూపంలో వ్రాయమని సలహానిచ్చారు అది మొదలు ముఖ్యంగా నాతండ్రిగారు రచించిన ''శ్రీ రామాయణ పారిజాతం''ను ఆమూలాగ్రం పఠించి ముందుగా శ్రీ ఆంజనేయ స్వామివారి కృపాకటాక్షవీక్షణాలకు పాత్రుడనవాలని తలచి సుందరకాండము ''శ్రీ పావని సుందరగానసుధ'' అన్న పేరుతో వ్రాసి, ముద్రించి, పాఠకలోకానికి అందించ గలిగాను నేను రాసిన సుందరకాండను, నేనే గానంచేసే మహద్భాగ్యాన్ని కలుగజేసారు నా సుందరరూపుడు అంజనిసుతుడు

5 ఏనాడు సుందరకాండను పూర్తి చేసి, గానం చేశానో నాటినుండి నాకష్టనష్టాలన్నీ మటుమాయం అయ్యాయి జీవితంలో నేను చేపట్టలేనన్న కార్యక్రమాలన్నీ సునాయాసంగా జరగటం మొదలయ్యాయి. **''అసాధ్యస్సాధక స్వామిన్, అసాధ్యం తవ కింవధ, రామదూతకృపాసింధో మత్కార్యం సాధయప్రభో''** అని పఠించి స్వామివారిని మనసా, వాచా కర్మణా నమ్మినవారికి అన్నీ జయాలే అపజయాలు చవిచూడరని నా నమ్మకం. వ్యాకరణంగాని ఛందస్సుగాని క్షుణ్ణంగా రాని నేను రామగానాన్ని వ్రాయటానికి నిస్సందేహంగా అనర్హుడను కాని స్వామివారి ఆశీస్సుల తోనే శ్రీరామగానాన్ని వ్రాయగలిగేశక్తిని సంపాదించుకున్నాను, దానికి తోడు నిరంతరం నాకన్నా ఎక్కువగా భక్తి ప్రపత్తులతో శ్రీమారుతిని కొలిచేనాసహధర్మచారిణి చి॥సౌ॥ గిరిజ నాకు మనోబలాన్ని సమకూర్చి, మిగిలిన బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధ, యుద్ధ కాండములు వ్రాయగలిగేటందుకు శతవిధాల దోహదపడింది. అదే విధంగా నా కుమార్తె చి సౌ పద్మశ్రీకుమార్ నేను వ్రాసిన

శ్రీరామాయణగానసుధను ఎప్పటికప్పుడు అందంగా కాపీచేసి కడు శ్రద్ధతో నాకందించి అపావని ఆశీస్సులందుకొంది ఆమెనమ్ము కున్న ఆశయాలకు ఆ పావనపావని అన్నీ విధాల సహకరించాడు. ఈశ్వరాంస సంభూతుడైన శ్రీ అంజనేయస్వామివారు, తననున మ్మిన వారికి, కొలిచేవారికి, సుందరకాండ పారాయణజేసేవారికి, విద్యా, వినయాదులతో బాటు సకలైశ్వర్యాలు కలుగజేస్తాడన్నది నిత్యసత్యం

ఈ అయోధ్యకాండను అతి తక్కువ వ్యవధిలో ముద్రించిన శ్రీ శర్వాణి ప్రింటర్స్ వారికి, శ్రీ ఎమ్ ఆర్.ఎల్ గారికి, శ్రీ సత్యశ్యాంగారికి, పీఠికవ్రాసిన "కళాప్రపూర్ణ" గణపతిరాజు అచ్యుతరామరాజుగారికి, మనోహరంగా ముఖచిత్రం వేసిన శ్రీ లంట్యాకుల నరసింహమ్మూర్తిగారికి (Ex Controller of Examinations, Andhra University) నా కృతజ్ఞతాభివందనాలు

భక్తిభావంతో వ్రాసిన నా "రామాయణగానసుధ"ను చదివిన బుధులు తప్పులున్న ఒప్పులుగాగొని వారి ఆశీస్సులు అందజేయు గలరని ఆశిస్తున్నాను నాశేష జీవితాన్ని "శ్రీరామ గానం" తో పునీతం చేసుకోవాలని, నా ఆకాంక్ష ఆపై స్వామివారికృప

ఓం శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

ఓం శ్రీ పవనతనయాయనమః

## శ్రీవినాయకస్తుతి

శ్రీవినాయకా - పార్వతి తనయ
ప్రమద గణాలకు - అధిపతి వీవు
సకల లోక - నివాసులందరు
నిన్ను ముందుగా - పూజించనిచో
వారి పనులకు - విఘ్నము కలుగును
కావున నిన్ను - నే మది నిలిపితి
శ్రీ రామాయణ - గానము రాయగ
నా కలమందున - నీవు నిలువుమా

## సర్వదేవతాస్తుతి

పాలసంద్రమున - పవ్వళించిన
ఫల్గుణు బ్రోచిన - పార్థసారథికి
మురారి పదములు - మెత్తగ ఒత్తెడి
ముగ్ధమోహన - స్వరూపిణి లక్ష్మికి
సత్యలోకమున - వేద పురుషులకు
శారదామాత - పాదయుగమునకు
భూలోకమున - బుధులందరికి
ప్రణామాంజలు - లర్పించుచుంటిని

## కవిగాయకులకు - నీరాజనము

శ్రీరామాయణ - గానము వినుడి
ముక్తికి దారిదు - సోపానమది
వల్మీక భవుని - కలమున విరసిన
వెన్నెల వెలుగు - విభుని చరితము
కాళిదాసుని - కావ్యకన్యక
రఘువంశమె - మన రామ చరితము
తులసీదాసుడు - ధన్యత చెందగ
రామచరితమా - నసను రచించె

రంగనాధుని - అంతరంగమున
అవతరించిన - అయోధ్యపతి కధ
గోపీనాధుని - గుండెల నిండిన
జానకీపతి - జనన చరితము
కవిభాస్కరుని - గంటము నుండి
గలగలపారిన - రామచరితము
మగువమొల్ల - మోదముతో రాసిన
మిధిలానాధుని - అల్లుని చరితము

గాన గంధర్వ - త్యాగరాయుని
గళమున నిల - చిన రామగానము
భక్తకబీరుని - భజనల నిలచిన
భరతాగ్రజుని - భవ్యచరితము
**పంతులవారి - వంశసోముడు**
**జోగరాయుని - పారిజాతము**
ఆ కవులందరి - దీవెనలంది
నే రాసితి శ్రీ - రామ గానము

# శ్రీరామాయణగానసుధ

## (అయోధ్యకాండము)

### ❀ భరతశత్రుఘ్నులు గిరివ్రజపురికి బయలుదేరుట

1. మాతా మహుని - కోరికమీరకు
భరతశత్రుఘ్నులు - వారి భార్యలు
మేనమామతో - గిరివ్రజపురికి
పయనమాయిరి - తండ్రి దీవెనతొ
ముద్దు మనుమలను - జూచిమురిసిరి
కేకయరాజు - దంపతులిరువురు
అయోధ్యవిష- యములన్ని యడిగిరి
విశ్రమింపుడని - వసతులకంపిరి

2. కన్నసుతులవలె - కేకయరాజు
మనుమలిద్దరిని - సాకుచుండెను
సదుపాయములు - ఎన్ని ఉన్నను
భ్రాతలిరువురు - ఎల్లవేళలా
దశరథు గూర్చి - చింతన జేసె
ప్రాణసమానుని - రాముని గూర్చి
ముచ్చటించుకొని - మురియుచుండిరి
భరతశత్రుఘ్నులు - బుద్ధిమంతులు

### ❀ శ్రీరాముని గుణవర్ణనము

3. కరుణామూర్తిని - క్రోధవిహీనుని
పురుషోత్తముని - పరిశుద్ధాత్ముని
భక్తియుక్తుని - భాస్కరతేజుని
విద్యానిధిని - వీర్యవంతుని
సకలధర్ముని - సత్యసంధుని
ప్రజలందరికీ - ప్రాణసమానుని
శ్రీరఘురాముని - భూనాథునిగా
చేయుమనిజనులు - దశరథుకోరిరి

4. జనవాక్య మెకర్త - వ్యమనితలచి
నానాదేశని - వాసరాజులను
భూసురవర్యుల - నిజబాంధవులను
పండితోత్తముల - పురోహితులను
మంత్రిసామంత - దండనాథులను
జానపదులను - వయోవృద్ధులను
సభకురమ్మని - ఆహ్వానములు
పంపెను నరపతి- కడుమోదముతో

❀ దశరథుడురాముని యువరాజుగా జేయనెంచుట

5. కొలువుతీరిన - దశరథుడంతట
సర్వజనంబులు - తృప్తిబొందగా
జనులందరినీ - కన్నబిడ్డలలె
మును మా పూర్వులు - పాలన జేసెరి
ఆ మార్గమెనే - ననుసరించితిని
శక్తి కొలదినే - పాలనచేసితి
అరువదివేల - వత్సరంబులు
అనిముదంబున - పలికెదశరథుడు

6. పెద్దకాలము - వచ్చెనునాకిక
పట్టుతప్పెను - అవయువమ్ములు
శౌర్య ధైర్యములు - కలిగినవాడే
ధరలో నాధుడు - అగుటకర్హుడు
సర్వగుణములా - నాసమానుడు
పౌరులందరికి - ఇష్టమైనచో
రామచంద్రుని - ధరణీపతిగా
చేయగనేను - సంకల్పించితి

### ❀ రామపట్టాభిషేకమునకు జనులందరు సమ్మతించుట

7. నరనాథుండు - అటులపలుకగా
జనులందరును - ఏకకంఠులై
సకలజగములు - ఏలువీరుని
సుమశరుమించెడి - సుందరాంగుని
జనకామితములు - దీర్చువానిని
రఘురాముని - పట్టాభిరాముగా
కన్నులకరువు - తీరురీతిగా
పట్టముగట్టుడు - అనిపలికితిరి

8. నీల శరీరుని - నిస్త్రింద్రధీరుని
బుధవిధేయుని - భవ్యచరితుని
కల్మషహారుని - కీర్తివిస్తారుని
సత్యధర్ముని - జన రంజనుని
శత్రునాశకుని - కృపాలవాలుని
అతిధర్మాత్ముని - పతితపావనుని
జలధిగంభీరుని - జానకీపతిని
ధరణీపతిగా - జేయుమనెజనులు

## ❀ దశరథుడు రామపట్టాభిషేక యత్నములుగావించుట

9. జనవాక్యంబులు - వినిరాజేంద్రుడు
అమితోత్సాహము - పొంగిపొరలగా
వామదేవుని - ఆవసిష్టగని
పుణ్యచరిత్రుని - రామభద్రుని
యౌవరాజ్యపద - పట్టముగట్టగ
యత్నములన్ని - ఆచరింపుడన
గురువసిష్టుడు - మంత్రిపుంగవుల
గాంచిపలికెను - ఈవిధంబుగా

10. కనక రత్నములు - రమ్యజోషధులు
కమ్మనినేతులు - తీయతేనియలు
శుక్ల మాల్యములు - ఛామరంబులు
బంగరు కుండలు - కొమ్ముల యెడ్లు
సంపూర్ణంబగు - వ్యాఘ్రచర్మమును
సైనికబలములు - సమీకరింపుడు
అగ్ని గృహంబున - జేర్పుడు నేర్పుతో
అనిమునీంద్రుడు - పలికెనప్పుడు

11. గృహద్వారములు - అలంకరింపుడు
సుగంధచందన - తోరణములతో
గంధజలమ్ములు - వీధివీధులా
జల్లుడుమీరు - సొగసు మీరగ
దధిక్షీరముల - పాయసాన్నముల
దక్షిణాదులతో - ద్విజతతులందర
సత్కరింపుడీ - సంతోషింపగ
అనివసిష్టుడు - పలికెనప్పుడు.

12. క్ష్మాపతిసంతస - మొందురీతిగా
స్వస్తివచనములు - చేయుటకొరకు
వేదవిదులైన - విప్రులందరిని
ఇనుడుదయాద్రిని - పొడమకమునుపే
కొలువుకురమ్మని - కబురు సేయుడు
వారసతులను - నర్తకిమణులను
మేళతాళముల - రమ్మని జెప్పుడు
అని వసిష్టుడు - పలికెనప్పుడు

## ❀ రాముడు దశరథుని కడకు వచ్చుట

13. దశరథుడంతట - ఆనందముతో
మంత్రిసుమంత్రుని - కాజ్ఞయొసంగెను
రఘురాముని తన - చెంతకుతెమ్మని
జనకుని ఆజ్ఞను - శిరమునదాలిచి
జగదభిరాముడు - బలగుణధాముడు
సభాంతరంబున - ప్రవేశించుచూ
అయోధ్యపతికి - అంజలిఘటించ
తనయుని కౌగిట - జేర్చె దశరథుడు.

14. కాంచనరత్నా - సనమున రాముడు
వినయముమీరగ - కూర్చొనినంతనె
బాలభానుడు - వేకువఝామున
మేరునగమును - కాంతివంతముగ
చేసినవిధముగ - శ్రీరఘురాముడు
వేయికాంతుల - వెలిగెడునటుల
తనప్రభలచే - కాంతిపుంజము
జేసెను కాంచన - రత్నాసనమును.

15. దశరథేశుడు - తన్మయమొంది
రాముని జూచి - ఇటులపలికెను
పుష్యయోగమున - పట్టముగట్టగ
సంకల్పించితి - బుధులుకోరగా
జితేంద్రియుడవై - శుద్ధశీలుడవై
ధనధాన్యములను - వృద్ధిజేయుచు
హితులుజనులు - మోదమందగా
ధర్మముగాచి - ధరను ఏలుమనె

16. ముగ్గురుతల్లుల - ముద్దు బిడ్డడు
సీతా సాధ్వితో - దీక్షవహించెను.
వందిమాగధులు - స్తోత్రముజేయగ
శ్రీ రఘురాముడు - శ్రీహరి గొలిచెను
దశరథుడెంతటి - ధన్యుడోయనుచు
రాముడెపుడు - అభిషిక్తుడగునని
పురజనులందరు - తలచుచుండగా
అయోధ్యఆయెను - అలకాపురిగా

### ❀ మంథర అయోధ్యాపురి వైభవమును గాంచుట

17. కుబ్జరూపమును - కలిగినదాది
కైకప్రేమకు - పాత్రురాలయిన
మందరయనెడి - నామముకలది
పుష్పవిలసిత - పృధివీతలమును
మంగళధ్వనులతో - అలరుఅయోధ్యను
గాంచినంతనే - కారణమడిగెను
శ్రీరఘురాముని - అభిషేకమ్మని
తెలిసినంతనే - రుసరుసలాడెను

18. విశ్రమించెడి - కైకను జేరి
విఙ్ఞవీగితివి - ముద్దులసతివని
భోగభాగ్యములు - బొగ్గులాయెను
శ్రీరామునియువ - రాజు చేయగా
సంకల్పించెను - ధరణీనాధుడు
రాముమాతయే - రాజమాతయగు
కష్టకాలము - నీకువచ్చెను
నీ దుఃఖమ్మును - నేనెటు జూతును

❀ కైక మంథరను బహూకరించుట

19. మందరమాటలు - వినినకైకేయి
మేనునదాల్చిన - మేలి భూషణము
కానుకనొసగెను - ఆనందముతో
అగ్రతనయుడగు - శ్రీరఘురాముడు
నా పుత్రుండగు - భరతకుమారుడు
ఒక్కరూపుగా - నాకు దోచును
నాపతిదేవుడు - దశరథరాజు
ధర్మపాలకుడు - ధరణియందున

❀ మంథర కైకను దూషించుట

20. నల్లనివన్నియు - నీరమ్ములని
తెల్లనివన్నియు - క్షీరమ్ములని
భావింపకుమా - బాలిశురాల
కీర్తిసిరులతో - కౌసల్యాసతి
వెలగుచుండగా - లజ్జనువీడి
దాస్యముజేయగ - యోచించితివా
రామునిసతికి - నీకోడళ్లను
పరిచారకలుగ - పంపదలచితివ

21. నీవులోతుగా - యోచించినచో
విషయములన్నీ - అవగతమగును
కౌసల్యసుమిత్రల - కడుపులుపండక
నిన్నుజేకొనెడి - సమయమందున
నీపుత్రులకే - రాజ్యమిత్తునని
మాటయిచ్చెను - నీ జనకునకు
భరతశత్రుఘ్నుల - దూరముపంపి
రామునిరాజుగ - జేయనెంచెను.

22. ధరణీనాధుడు - రాముడాయెనా
అతనికురమారులె - ధరనేలెదరు
భరతకుమారుడు - అనాధుడగును
కాననమందున - సింహము బారిని
పడినగజమువలె - భరతకుమారుడు
రాముబారిపడి - ఇడుములు కుడుచును
నీ సుతురాజుగ - జేయగదలచి
ఆలోచించితి - నొక్క నుపాయము.

 కైక కోపగృహమున కరగుట

23\. అనేకరీతుల - అనేకయుక్తుల
కైకమనమును - మలినముజేసి
మునుదేవాసుర - రణమున ఒసగిన
వరములు రెండూ - కోరుమిప్పుడు
ఒకటి భరతు - పట్టాభిషేకము
రెండు రామునికి - కాననవాసము
అనినమాటలు - వినినకైకేయి
అరిగెనప్పుడు - కోపగృహమునకు

24 మలినవస్త్రమును - మేనునదాల్చి
శయ్యాగృహమును - చిందరజేసెను
ఆభరణమ్ములు - పారవేసెను
పుష్పములను - చిందించివైచెను
జడకుచ్చుల - విప్పారబోసెను
రామపట్టాభి - షేకవార్తను
కైకకుదెలుప - దశరథుడొచ్చి
కారణమడిగెను - కోపంబునకు

❀ కైక దశరథునిచే ప్రతిజ్ఞ చేయుంచుట

25. ఎన్నోవిధముల - ఎన్నోరీతుల
కోపకారణము - అడిగెదశరథుడు
లలనలందునీ - కంటె ప్రియులును
పురుషులందు - రఘురామునికంటెను
ప్రియులులేరునా - కీభువియందున
ప్రాణసమానుని - రాముని ఆన
కోపకారణము - నీవు తెలిపిన
సంతోషమ్ముగ - నేదీర్చెదనని

26. కపటప్రేమను - ప్రదర్శించుచు
పరిపరికన్నీ - రొత్తు కొనుచునూ
రామునిపైన - ఆన ఇడితిరి
నాకోరికచె - ల్లించెదననుచు
దేవాసురుల - యుద్ధమునందు
వరములురెండు - నాకొసగితిరి
ఆవరములను - కోరుకొనుటకు
అనుజ్ఞనొసగుడు - ఈ దినంబున

27. సత్యసంధులు - పరమధార్మికులు
ఆడినమాటను - తప్పనివారు
కావుననేను - అడుగుచుంటిని
మొదటివరముగా - నాభరతునకు
పట్టముగట్టుడు - ఆనందముగా
రెండురాముడు - మునివేషముగొని
పదునాల్గేండ్లు - కాననవాసము
పంపగకైక - దశరథుకోరెను.

❀ *కైకవరములు విని దశరదుడు దుఃఖించుట*

28. కైకవరములు - విని దశరథుడు
పొరలిపొరలి - దుఃఖించెనంతట
వేడుకొనెను - కైమోడ్పులు జేసి
కైకకుమ్రొక్కెను - పాదములంటి
వలదువలదు ఆ - రెండువరములు
వేరువరములు - కోరుకొమ్మనెను
కావలనంటే - ఇచ్చెదననెను
ధరణిపైనగల - ధనమంతయును

29. మనుజేంద్రుడు - తనమాటదప్పెనని
కైక దూషించె - నజునితనయుని
హా! రామా! నా - నోములఫలమా
అని దుఃఖిచుచు - నేలకొరిగెను
ఈ విషబోధలు - జేసినదెవరు
సీతాకాంతుని - బాసిననేను
బ్రతుకగలేను - నిముషమైనను
అటుపిమ్మటఈ - విధవారాజ్యము
కట్టుకొమ్మనీ - శిరమునందునా

30. ఆ మాటలకు - కైకయిటులనె
శిబియానాడు - శరణుజొచ్చిన
కపోతమ్మును - కాపాడుటకై
దేహమందున - మాంసముకోసి
డేగకిచ్చితన - మాటనిలిపెను
అదేరీతిగా - అలర్క రాజు
మాటనిలుపుటకు-రెండునయనములు
దీసియిచ్చెను - ద్విజసత్తమునకు

31. సర్వనదులకు - అధిపతి అయిన
సంద్రుడుకూడ - సత్యవ్రతముచే
చెలియలకట్టను - దాటుటలేదు
కావునమీరు - సత్యమువిడువక
నా వరమ్ములను - నేరవేర్చుండనె
అటులకానిచో - నిండుసభయందు
రామపట్టాభి - షేకసమయమున
అసువులువీడెద - ఇది సత్యమ్మనె.

 *సుమంత్రుడు దశరదుని జూడవచ్చుట*

32. ఉషఃకాలమున - మునివసిష్ఠుడు
యత్నములన్నీ - సఫలముజేసి
ధరణీనాధుని - వేగమెరమ్మని
కైకగృహమునకు - పంపెసుమంత్రుని
నేలనుబడిన - దశరధుగాంచి
రాణికైకను - కారణమడిగెనను
రాత్రియంతయు - రామునిగూర్చి
ఆలోచించుచు - అటుపరుండెననె.

33. కైకపలుకుల - అంతరార్థమును
కొంతవరకు గ్రహి - యించెసుమంత్రుడు
రామునివేగమె - తోడ్కొనిరమ్మని
వచ్చినతోడనె - విషయములన్నీ
వెల్లడియగునని - విన్నవింపుమని
కైక ఆజ్ఞఇడ - సుమంత్రుడంతట
నదీగర్భమున - చేరుముసలివలె
వేవేగమెజనె - రాముగృహమునకు

34. భువనమోహనుని - శ్రీరమరాముని
పాదములంటి - అంజలిఘటించి
మాతకైకేయి - గృహమునందున్న
దశరథేశుడు - వేగమెరమ్మనె
మంత్రిసుమంత్రుని - పలుకులు వినుచూ
సీతనుగాంచి - రాముడిటులనె
అంతరాయము - కలుగుసూచన
హృదయాంతరమున - కదలుచున్నదనె



### రాముడు దశరథునిజూడ వచ్చుట

35. మంత్రిసుమంత్రుని - గూడిరాముడు
అరదముపైన - కాలుమోపగనె
జనసమూహము- జయజయధ్వనులిడ
మంగళధ్వనులు - మిన్నుముట్టగా
వందిమాగధులు - స్తోత్రములిడగా
ఉత్తమాంగనలు - పూలు జల్లగా
వర్ధమానమను - దశరథుభవనము
జేరెను రథము - అతిశీఘ్రముగా



### రాముడు కైకను తండ్రి దుఃఖమునకు కారణమడుగుట.

36. కాంతిహీనుడై - తల్పంబునబడి
కంటికిమింటికి - ఏకధాటిగా
దుఃఖించెడితన - తండ్రినిగాంచి
కరములు మోడ్చి - కైకనడిగెను
అమ్మలైనకౌ - సల్యాసుమిత్రలు
భరతశత్రుఘ్నులు - క్షేమమేగదా
తండ్రిచెప్పుటకు - వెనుకాడిననూ
తల్లీజెప్పుడు - బాధనుదీర్చుడు

### ❀ కైక రామునకు వరములను గూర్చి వివరించుట

37. మంచిచెడులు - విచారణసలుపక
భావిప్రమాదము - మదిగుర్తించక
దశరథుడొసగిన - రెండువరముల
గతవృత్తాంతము - అంతయుదెలిపి
మొదటివరముగా - నాభరతునకు
పట్టముగట్టగ - నేకోరితిని
రెండునిన్నుపదు - నాలుగుఏండ్లు
కాననవాసము - పంపగోరితిని

38. నీదు జనకుడు - సత్యవ్రతుండు
నీవునుగూడ - సత్యవ్రతుడవు
తండ్రిశపథము - దీర్చగనెంచిన
జిటాజినమ్ములు - నారవస్త్రములు
గ్రక్కునగైకొని - పదునాల్గేండ్లు
వనవాసమ్మును - చేయుమురామా
ఈమాటలుతను - చెప్పగలేక
నీదు జనకుడు - దుఃఖితుడాయెను.

### ❀ రాముడు దశరథునకు నమస్కరించి బయలుదేరుట

39. ఆ పలుకులువిని - రఘువరుడంతట
మొలకనవ్వుతో - ఇటులపలికెను
పితృవాక్యపరి - పాలుడురాముడు
పితృద్రోహికా - లేడువిన్నడు
కావుననేనే - అయోధ్యవీడి
కాననవాసము - జేయగనెంచితి
రామునిపలుకులు - వినిదశరథుడు
రఘురామాయని - మూర్ఛితుడాయెను.

40. చిమ్మచీకట్లు - క్రమ్ముకొన్నను
చంద్రునికాంతి - సమసిపోనటుల
ఎడదనిండుగా - బాధయున్నను
ముఖవికాసము - తరుగనిరాముడు
కైకదశరథుల - కంజలినొసగి
పాదచారుడై - బయలుదేరెను
వింజామరలు - వెండిరథమ్మును
తాకగతనకిక - అర్హతలేదని
మంత్రిసుమంత్రుని - జూచిపలికెను.

❀ **రాముడు కౌసల్యను జూచుట**

41. నేరుగరాముడు - జననికౌసల్య
అంతఃపురమున - కాలిడినంతనె
ఎదురుగవచ్చి - శిరసుముద్దాడి
తండ్రీరామా - పూర్వులవలె నీ
కీర్తిపతాకము - దిగంతాలకు
ప్రసరించవలె - అని ఆశీస్సిడ
దండకాటవికి - అరుగుటకొరకు
నీ ఆనాత్తికై - ఇటువచ్చితిననె

❀ **కౌసల్య రాముని మాటలువిని మూర్ఛబోవుట**

42. పిడుగులవంటి - ఆమాటలువిని
గొడ్డటనరికిన - మద్దిచెట్టువలె
గాలిపోటుకు - ఊగికూలిన
కదళీకాండము - వలెకంపించెను
వశమును దప్పి - వసుధగూలుచు
గతజన్మంబున - మాతాసుతులకు
యెడబాటును - నేసలిపతినేమో
రామా! యనుచు - నేడ్వదొడంగెను

43. నాకలలన్నీ - కల్లలాయెను
ఆశలన్ని అడి - యాసలాయెను
నేగావించిన పూ - జలు వ్రతములు
హోమములన్నీ - వ్యర్థములాయెను
ఆడినమాటను - తప్పనివాడని
తండ్రియానజవ - దాటనివాడని
రాముమనము - కనుగొన్నకౌసల్య
తనను గూడగొని - పొమ్మనె అడవికి

❀ లక్ష్మణుడు రాముని వనమునకు పోవలదని చెప్పుట

44. కౌసల్యసతి - పలుకలువినిన
లక్ష్మణుడంతట - మహోఉగ్రుడై
పడతిమాటకు - లోబడిరాముడు
రాజ్యమువదలి - అడవులకేగుట
నేసహియింప - నంగీకరింపను
నిరపరాధిని - నిర్మలచిత్తుని
అడవులకంపే - అధికారమ్ము
లేదు భువియందు - ధరణీశ్వరులకు

45. ఋజువర్తనుడు - జితేంద్రియుండు
అయినరాముని - అడవులకంపగ
మహాధార్మికుడు - పవిత్రవీరుడు
అయినజనకునకు - మనసెటులొప్పె
ఇందున ఏదో - రహస్యమున్నది
మతిచలనముచే - మానిని వశమై
రాజు అనతి - ఇచ్చినయెడల
ఆచరించుట - తగదనిపలికె

46. రుద్రరూపుడై - లక్ష్మణుడిటులనె
మాతకైకేయి - వరములురెండూ
ఇతరులచెవిని - సోకకమునుపే
నీరాజ్యమ్మును - జేకొనుమిపుడే
ధనుర్ధారినై - వెంటనుందును
ఎవ్వరేనినిన్నె - దిరించినచో
నా శరమ్ములకు - ఆహుతిజేసెద
ముంతునయోధ్యను - బాణజాలమున

### ❀ రాముడు లక్ష్మణునకు ధర్మంబెఱింగించుట

47. పరుషవాక్యములు - వినినరాముడు
లక్ష్మణుతోడ - ఇటులపలికెను
నీ అనురాగము - బలసంపదలు
నాకు తెలియని - విషయములా
పురుషార్థములకు - మూలముధర్మము
సత్యములేక - ధర్మములేదు
పితృవాక్యపరి - పాలనవలన
సత్యధర్మములు - సమకూరునునాకనె

### ❀ రాముడు కౌసల్యనోదార్చుట

48. జననిపాదములు - పట్టిరాముడు
పదునాల్గేండ్లు - వనవాసమ్మును
ఆనందముగా - గడపినపిమ్మట
వ్రాలగలనునీ - సన్నిధినేను
జనకుని ఆనను - నీవు సుమిత్రయు
లక్ష్మణభరత - శత్రుఘ్నాదులు
శిరసునిడుకొని - నెరవేర్చవలె
అనిసనాతన - ధర్మము దెలిపెను.

49. ఆ పలుకులువిని - లక్ష్మణుడిటులనె
తనువులురెండూ - వేరుగనున్నను
ప్రాణమొక్కటని - మరచిపోతివా
కాననవాసము - నీవొనరించిన
రామునేవకు - అంకితమయిన
నాసేవలను - ఎవరికొనర్తును
నీవు ఆనతి - ఇచ్చినయెడల
నీపాదములను - అంటియుందును

❀ రాముడు లక్ష్మణునిసేద తీర్చుట

50. లక్ష్మణుత్యాగము - వినినరాముడు
మనమునఎంతో - సంతసించుచూ
జన్మజన్మల - అనుబంధముచే
నీవుభ్రాతగ - జనియించితివి
మాతసుమిత్ర - ఆజ్ఞనుబడసి
రమ్మునాదరికి - శీఘ్రుగామివై
అనుచుకౌసల్య - పాదములంటి
అనుమతికోరెను - అడవికేగుటకు

### కౌసల్య రామవనవాస మంగీకరించుట

51. అక్కునజేర్చి - శిరసుముద్దాడి
పితృవాక్యపరి - పాలనజేసి
పిత్రూణము - చరితార్థతజేసి
తిరిగిరమ్మునా - అనుంగుతనయా
దైవనిర్ణయము - మార్చగలేము
ఏ ధర్మమునకు - కట్టుబడితివో
ఆ ధర్మమెనిను - గాచునెప్పుడు
కాననవాసము - జేయుసమయమున

52. గాధితనూజుడు - నీ కొసంగినా
శస్త్రసంపదలు - నిన్నుగాచుత
మాతాపితరుల - సేవలవలన
ఆయురారోగ్యములు-సమకూరుత
పర్వతంబులు - నదీనదంబులు
పాములు పొదలు - పక్షిగణంబులు
ఆరణ్యంబున - అండగనిలచి
ఆనందంబును - నీకందించుత

53. అష్టదిక్కులా - అధిపతులందరు
సూర్యచంద్రఇం - ద్రాదిదేవతలు
నక్షత్రాదులు - గ్రహరాజులును
కాపాడుత - నిన్నెల్లవేళల
క్రూరకర్మములు - సలుపురక్కసులు
చల్లనిప్రేమకు - దాసులగుదురు
క్రూరమృగములు -పాములుపురుగులు
సోకగలేవు - సుందరాకార

**కౌసల్య రామునకు రక్షాబంధనము జేయుట**

54. పొరలివచ్చుదుః - ఖమును మ్రింగుచు
సంతోషమ్మును - అభినయించుచూ
మంగళగీతిక - లాలపించుచూ
మంచిగంధము - మేనునఅలది
మంత్రించిన ఒక - రక్షనుగట్టి
మంత్రాక్షతలు - శిరసునజల్లి
ఆనందముగా - అయోధ్యవీడుము
నీవుక్షేమముగ - నాదరిజేరుము

## ❀ రాముడు తనమందిరమున ప్రవేశించుట

55. విడువగలేక - విడువగలేక
జననికౌసల్య - పాదమువదలి
జనావృతమగు - రాజవీధిలో
పాదచారుడై - నడచుచురాముడు
నిజగృహమ్మును - జేరినంతనే
వెలవెలబోవు - రాముముఖమును
గాంచినంతనే - సీతాసాధ్వి
కారణమడిగెను - మేనువణకగా

56. నేడుబృహస్పతి - దేవతాంకితము
అయిన దినమని - జెప్పితిరికదా
శుభకరమయిన - ఈదినంబున
యౌవ్వరాజ్యప - ట్టాభిషేకమని
బ్రాహ్మణోత్తములు - నుడివితిరిగదా
శ్వేతఛత్రము - వింజామరలు
వందిమాగధుల - స్తోత్రపాఠములు
లేకుండగమీ - రరుదెంచితిరనె

### ❀ సీతకు రాముడు వనవాస వృత్తాంతము దెలుపుట

57. ప్రశ్నలువేయు - అర్ధాంగినిగని
పూజ్యపాదులగు - నాజనకుండు
 పూర్వమొకప్పుడు - జననికైకకు
 రెండువరమ్ములు - ప్రీతి నొసంగిరి
నేడావరములు - మాతకోరెను
మొదటభరతు - పట్టాభిషేకము
 రెండుతానుజ ట - వల్కాలాలతో
 పదునాల్గేండ్లు - కాననవాసము

58. నీకు దెలిపినే - నేగదెంచితిని
సర్వధర్మములు - తెలిసినదానవు
 నేటినుండినా - తమ్ముడు భరతుడు
 ఈరాజ్యమ్మున - ప్రభువైనిలచును
పట్టాభిషేకము - అయినపిమ్మట
నీదీ వెనలను - పొందగవచ్చిన
 తూలనాడుట - తిరస్కరించుట
 తగదనిచెప్పెను - రాముడు సీతతో

59. ముదుసలిఅయిన - నాజనకునకు
సర్వసపర్యలు - జేయుముదమున
తల్లులైనకౌ - సల్యసుమిత్రల
ఆజ్ఞలు నీవు - అతిక్రమించకు
భరతశత్రుఘ్నులు - ప్రాణసమానులు
వారినిద్దరిని - తోబుట్టులవలె
లేకసుతులవలె - ఆదరింపుమా
అనుచురాముడు - సీతతొపలికె

60. ముసిముసినవ్వుల - సీతనవ్వుచూ
తల్లిదండ్రితో - బుట్టుకొడుకులు
కోడలు మొదలగు - వారలందరూ
వారుజేసిన - పాపపుణ్యముల
ఫలితముగా ఆ - శుభాశుభములను
అనుభవింతురు - ఈ భూవియందున
సర్వధర్మములు - ఎరిగినమీరు
పరధర్మమ్ములు - ఏలచెప్పుదురు.

❀ సీత రామునితో అరణ్యమునకు వచ్చెదననుట

61. భర్తతోడిదే - సతికిమార్గమని
నాజనకుండు - నాకుజెప్పెను
కాననవాసము - జేయవలెనను
కాంక్షనాలోన - కలిగెనుఎప్పుడో
పతిదేవునితో - కాననవాసము
జేయునాజన్మ - ధన్యమాయెను
మీరులేనిఈ - అయోధ్యయందున
నేనెటులుందునో - మీరేజెప్పుడు

❀ రాముడు వనవాసశ్రమలు దెల్పుట

62. ఆమాటలువిని - రాముడంతట
కాననవాసపు - కడుసమస్యలు
విశదముగావివ - రించిచెప్పగా
పెళ్ళికిమునుపాక - తాపసాంగన
పెళ్ళికిపిదప - పతితోకలసి
కాననవాసము - నేజేసెదనని
తెలియబరచెను - నాజనయిత్రికి
ఇపుడామాటలు - సత్యములాయెను.

63. తల్లిదండ్రులను - కడుదుఃఖమ్మున
ముంచుచుమీరు - అడవులకేగుచు
అత్తకౌసల్యకు - చేసినబోధలు
నాకుమాత్రము - అన్వయింపవా
రామచంద్రులై - మీరు దయించిరి
భూమిజాతనై - నేజనించితిని
కాననమందు - చంద్రుడుండగా
అయోధ్యయందున - వెన్నెలుండునా?
అనవినిరాముడు - ఇటులపలికెను.

64. మానససరసిలో - నిర్మలజలములు
గ్రోలి జీవించు - రాజహంసములు
లవణజలములు - త్రాగిబ్రతుకునా
తియ్యమామిడి - తోటలయందున
లేచిగురాకులు - తినెడికోయిలలు
తిరుగగలేవు - తుమ్మతోటల
కావుననీవు - నామాటలువిని
అయోధ్యయందు-సుఖముగనుండుము.

65. ఆమాటలువిని - సీతఇటులనె
కాననమందున - మీతోనుండిన
కందమూలములు- అమృతసమానము
మృగసంతతులే - నాబంధువులగు
గహనసీమలే - పట్టణంబులగు
వల్కాలంబులే - పీతాంబరములు
పర్ణశాలయే - సుందరసదనము
వనదేవతలే - అత్తమామలగు

66. మిమ్మువిడచి - జీవించగలేను
కనికరించినను - చేకొనిపోవుడు
పదునాల్గేండ్ల - వనవాసమునకు
ఆపలుకులువిని - రాముడిట్టులనె
నీమనంబును - ఎరుగగగోరి
నుడివితినెన్నో - ధర్మంబులను
భాస్కరువెనుక - సువర్చలవలె
నీవునాతోడ - రమ్ముఅడవికనే

### ❀ రాముడు తన వస్తువులను దానము జేయుట

67\. ఇన్నినాళ్లుగా - ప్రేమగ పెంచిన
పక్షిగణమ్ములు - నీవులేనిచో
　　అతి త్వరలోనే - అసువులు వీడును
　　కావుననీవు - పంజరంబులా
పక్షులన్నిటిని - విడిచిపెట్టుము
గోగణంబులను - బ్రాహ్మణులకును
　　పలుపలురకముల - వస్తువులన్నీ
　　బీదసాదలకు - పంచిపెట్టుము

68\. రాముండంతట - లక్ష్మణుజూచి
మునివసిష్టుని - పుత్రుసుయజ్ఞుని
　　వేగదోడ్కొని - రమ్మనిపలికెను
　　కాంచనాంగములు - రత్నచయంబులు
నానాసురుచిర - భూషణాదులు
ఆ సుయజ్ఞునకు - అర్పణజేసెను
　　మునివరుడుంతట - మోదమునొంది
　　దీవించిచనె - తనగృహమునకు

### ❀ త్రిజటుడను బ్రాహ్మణుని వృత్తాంతము

69. అంతత్రిజటుడను - బ్రాహ్మణోత్తముడు
ఊంఛవృత్తి చే - బట్టిన వాడు
తనదారిద్ర్యము - తీరునట్టుల
కోరినంతసిరి - తనకిమ్మనెను
అంతరాముడు - మందహాసమిడి
సరయూనదితటి - యున్నభూమిని
గోగణములను - వృక్షసంపదయు
ధారబోసె ఆ - విప్రునికరమున

70. తల్లి ఆనతిని - పొందిన రాముడు
సాధ్వి సీతతో - లక్ష్మణుతోడను
దశరథుగాంచగ - మందిరమేగెను
రామచంద్రుని - జూచిధశరథుడు
అక్కునజేరిచి - ఆక్రోశించెను
పాదములంటి - రాముడుపలికెను
నన్నుదీవించి - శలవునొసంగిన
ఏగెదవేగమె - గహనభూములకు

71. ఆ పలుకులువిని - కైక ఇట్టులనె
త్వరితముగా - నీవడవులకేగిన
దశరథనరపతి - శాంతమొందును
కావుననీవిక - పరిగ్రహింపుము
తులసిమాలలు - నారవస్త్రములు
అనిపలికెడిఆ - కైకనుజూచి
ఓసిరాక్షసి - పాషాణహృదయి
అనుచుదశరథుడు - ధరణినిగూలెను

72. దశరథుదుఃఖము - గాంచివసిష్ఠుడు
రామునిమాత్రమె - కానకుబంపగ
వరముగోరితివి - ధరణీశ్వరుని
కావుననీవు - రమణిసీతకు
నారవస్త్రములు - ఈయగతగదని
వసిష్ఠమునీంద్రుడు - కైకతోపలుక
అర్ధాంగిగనే - ననుసరించుట
తప్పుగాదని - సీతపలికెను.

❋ రాముడు కౌసల్యను కాపాడమని దశరథుని కోరుట

73. నారవస్త్రములు - ధరించిరంతట
సీతాసాధ్వియు - రామలక్ష్మణులు
దానినిగాంచిన - వసిష్ఠుడంతట
కైకనెన్నోదు - ర్భాషలాడెను
మాతకైకను - దూషించుట
సమ్మోదముకా దని - రాముడుపలికి
తనజనని కౌ - సల్యమాతను
దయజూడమని - దశరథుగోరెను.

❋ కౌసల్య సీతకు ధర్మోపదేశంబు జేయుట

74. కౌసల్యాసతి - కోడలుసీతకు
ఉపదేశములను - ఎన్నోతెలిపెను
తల్లులందరికి - గురువసిష్టునకు
శిరమునువంచి - వందనములిడి
అంతఃపురమును - విడచిపెట్టగా
బారులుతీరిన - జనబాహుళ్యము
గొల్లుగొల్లుమని - ఏడ్వసాగిరి
తలలుబాదుకొని - దుఃఖితులైరి.

 **రాముడు పురజనులను ఓదార్చుట**

75. శోకసంద్రమున - మునిగినజనులను
గాంచినరాముడు - అంజలిఘటించి
పదునాల్గేండ్లు - అరణ్యావాసము
జేసినపిమ్మట - అయోధ్యజేరుదు
కైకవరముకడు - యోగ్యమైనది
మీకునునాకును - ఈలోకమునకే
కళ్యాణము సమ - కూర్చగలదని
మృదుమధురంబుగ - రాముడుపలికె

76. రామా! రామా! - అనుచుదశరథుడు
మూర్ఛనుండి మే - ల్గాంచినవాడై
అతిసుకుమారులు- ఇరువురుతనయులు
ఎండయె ఎరుగని - కోడలు సీత
తామరరేకుల - వంటిపాదములు
భాస్కరుపేడికి - బొబ్బలెక్కును
కావునవారిని రథ - ముననిడుకొని
గహనభూములకు - పంపగ కోరెను

77. రామచంద్రుడు - ధీరోదాత్తుడు
ఆపగజాలరు - ఎవ్వరాతనిని
అరదమునుగొని - ఆహ్వానింపుము
ఆరణ్యమును - జేరినపిమ్మట
రామునాజ్ఞగొని - రాజధానికి
వేగరమ్మని - తేడుపలుకగా
అరదమునుగొని -మంత్రిసుమంత్రుడు
వేవేగమెజనె - రామునన్నిధికి

78. దశరధుకోరిక - శిరమునదాలిచి
సీతారామా - లక్ష్మణాదులు
రధమునంతట - అధిరోహించిరి
పురవీధులబడి - ఏగుచుండగా
బాలురు వృద్ధులు - స్త్రీలు యువకులు
విప్రోత్తములు - విలపించుచునూ
ఓరఘురామా - మమ్ములగూడ
తోడ్కొనిపొమ్ము - కాననములకనె

79. ధర్మదేవత - లేనిపురంబు
గహనభూముల - కన్నుఘోరము
అట్టిపురంబున - బ్రతుకజాలము
మీకాననమే - మాకుపురంబగు
పితృవాక్యమే - మీకు ప్రధానము
ఆత్మారాముడు - మాకు ప్రధానము
కావునమేము - వెనుకకుమరలము
మరలిన మరణమె - మాకు శరణ్యము

❀ **రాముడు తమసా నదీతీరమును దాటుట**

80. జనులందరును - అటులపలుకగా
తనధర్మమ్మును - మించినప్రేమను
వారియందునా - జూడగలిగితని
రామచంద్రుని - మనసుద్రవించె
పశ్చిమదిశను - భానుడుక్రుంగగ
చిమ్మచీకటులు - క్రమ్మెక్షణమ్మున
తమసానదితటి - చేరినరాముడు
కోరెజనుల - విశ్రాంతిపొందగ

### ❀ రాముడు పౌరుల మోసగించి పోవుట

81\. రెండుఝాముల - సమయమందున
మంత్రిసుమంత్రుని - రాముడులేపి
నిదురించెడి ఆ - జనులందరకు
నిద్రాభంగము - కలుగకుండగా
అరధముజాడలు -కనపడకుండా
వేగమెవీగుము - అడవిమార్గమున
అనిపలుకులు-వినినసుమంత్రుడు
రధమునునడిపె - చాకచక్యముగ

### ❀ పౌరులు అయోధ్యకు మరలిపోవుట

82\. తూర్పునభానుడు-ఉదయించగనే
నిదురనుండి మే - ల్గాంచిరిజనులు
సీతారామా - లక్ష్మణాదులను
అచటగానక - కడుదుఃఖించిరి
రధపుజాడలు - జూచినవారు
రాముడయోధ్యకు - అరిగియుండెనని
జనులందరునూ - ఏకకంఠులై
నగరిఅయోధ్యను - జేరెముదమ్మున

 **రాముడు కోసలరాజ్యము దాటుట**

83. ఆ తమసాతటి - తీరముదాటి
కోసలరాజ్యము - జేరెరాముడు
బహుతరంగ - గంగానదిగాంచి
పరవశమొందెను - రఘునందనుడు
భూతలమందున - మంగళములకు
ఆనందములకు - మూలము గంగని
చిత్రవిచిత్రపు - కథలెన్నిటినో
రాముడు తెలిపి - స్నానము జేసెను.

 *గుహుడు రాముని దర్శించుట*

84. శృంగిబేరమను - పురమునందునా
నిషాదాధిపతి - గుహుడనువాడు
రాముడుసీతా - లక్ష్మణసహితుడై
కాననమందున - కనిపించెనని
జనులు చెప్పగా - సంతోషమ్మున
ఫలపుష్పములను - సమకూర్చుకొని
బంధుజనులతో - భజనలు జేయుచు
రాముని జేరి - కానుకలొసగె.

85. అటులస్వాగతము - పలికినగుహుని
రాముడంతట - అక్కునజేర్చగ
దుర్లభమైన - మీదర్శనము
పుణ్యవశముచే - మాకు చిక్కెను
మీ చరణమ్ములు - సోకినప్రాంతము
కడుసుభిక్షమై - ఇకవర్ధిల్లును
సందియములేదు - లోకనాయకా
అనిరఘురాముని - పదములపైబడె

❀ లక్ష్మణుడు గుహునకు రామవనవాస వృత్తాంతము జెప్పట

86. లక్ష్మణుడంతట - గుహునకుతెలిపెను
రామవనవాస - కారణమంతయు
ఆమాటలువిని - అచ్చెరువొంది
గుహుడురాముని - పాదములంటి
నాధనసంపద - రాజ్యముప్రజలు
నేటినుండినీ - సేవాపరులు
నేనీదాసుడ - శృంగిబేరమును
ముదముమీరగా - పాలింపుమనె

87. నిర్మలహృదయా - నిషాదరాజా
జనకుని ఆనతి - దీర్చునెపమ్మున
పదునాల్గేండ్లు - కాననమందున
మునివేషముగొని - సంచరించవలె
నగరనివాసము - చేయగరాదు
అందుమూలమున - నీకోరికను
తీర్చగలేనని - ఆత్మీయతతో
రాముడుపలికె - గుహునితోడను

88. పక్షులుగూడులు - చేరినపిమ్మట
శృంగిబేరపుర - జనులందరునూ
తమతమవీడులు - చేరినపిమ్మట
మృదుమధురములగు-కందమూలములు
సీతారామా - లక్ష్మణాదులు
భుజియించిరి - కడు ఆనందముతో
గుహుడు అమర్చిన - శయ్యానువదలి
పర్ణశయ్యపై - పరుండెరాముడు

### ❀ నిదురించెడి రామునిగాంచి గుహుడు దుఃఖించుట

89. నిదురించెడి ఆ - రాముని జూచి
అశ్రుధారలను - గార్చుచుగుహుడ
ఇంద్రునిభవనము - మించుభవనము
దశరథుభవనము - అనివిరియుంటిని
హంసతూలికా - తల్పములందున
మణిదీపములా - కాంతులయందున
పాలకడలితో - సమానమైన
తెల్లనిపానుపు - మెత్తనిదిండ్లపై

హాయిగనిదురిడు - రామచంద్రుడు
కటికచీకటుల - రాతి నేలపై
తరుమూలమున - పర్ణశయ్యపై
జానకిగూడి - ఇటునిదురించుట
ఈ కన్నులతో - చూడగవలసెను
కడునికృష్టుడ - కడుదౌర్భాగ్యుడ
ననివిలపించుచు - నిషాదాధిపుడు
లక్ష్మణుతోడ - పలుకజొచ్చెను

 **రామలక్ష్మణులు జడలు ధరించుట**

90. ఉషఃకాలమున - రామచంద్రుడు
నిదురమేల్కొని - గంగకుపోయి
స్నానసంధ్యాదులు - ఆచరించుకొని
మఱ్ఱిపాలువే - వేగమెతెమ్మని
లక్ష్మణుజూచి - కోరినంతనే
దొప్పలనిండుగ - పాలను తేవగ
తెచ్చినపాలను - కురులకు వ్రాయగ
కురులన్నియుపలు - జటలుగమారెను.

 **సుమంత్రుడు రామునితో అరణ్యమునకు వత్తుననుట**

91. ఆదృశ్యమ్మును - గాంచిసుమంత్రుడు
గొల్లునఏడ్చుచు - కనులుమూసుకొని
రాజతిలకమును - జూచునేత్రములు
జటాజూటములు - జూడనోచెనా
అనుచుసుమంత్రుడు - రాముని వేడెను
పదునాల్గేండ్లు - కాననమందున
శ్రీరఘురాముని - సేవలు చేయుచు
తరించిపోవగ - అనుమతివేడెను.

### ❀ రాముడు సుమంత్రునకు హితము దెలుపుట

92. ఓయిసుమంత్రా - దశరథేశ్వరుని
ఆనతినీవు - పాలించవలె
శీఘ్రమెనీవు - అయోధ్యకేగి
నా జనకునకు - శాంతినొసంగుము
రామునాజ్ఞను - మీరజాలక
ముకుళితకరుడై - వందనములిడి
బాష్పకణములు - జార్చు తురగముల
పొమ్మనిపలికె - అయోధ్యపురికి

### ❀ రాముడు గంగనుదాటుట

93. జాలరితెచ్చిన - పడవయందునా
సీతాలక్ష్మణ - గుహులతోడను
ముచ్చటించుచు - పయనమాయెను
గంగాయమునల - సంగమంబున
తీర్థరాజమగు - ప్రయాగనుగని
దానివైభవము - దానిమహోత్త్యము
విపులముగా - వివరించిచెప్పెను
రఘుకులసోముడు - వారందరికి

 **రాముడు భరద్వాజముని ఆశ్రమంబుజేరుట**

94. ప్రయాగయందున - నెలకొనియున్న
భరద్వాజముని - ఆశ్రమంబును
జేరినరాముని - తాపసోత్తముడు
కనుగొనినంతనె - అక్కునజేర్చి
అప్యాయముగా - ఆహ్వానించెను
సదమలక్షేత్రపు - విషయములన్ని
వినుతినిజేసి అట - వాసరముండగ
రామునివేడెను - తాపసవర్యుడు

95. కడుమోదముతో - రాముడుపలికె
తాపసోత్తమా - ఇటనేనుండిన
నాజనులందరు - జూడవత్తురు
ఆశ్రమమంతయు - అయోధ్యయగును
కావునమేము - వాసముండుటకు
అనుగుప్రదేశము - తెలుపగోరెదను
అనవినిమునిపతి - అవలోకించి
చిత్రకూటము - సరియగుస్థలమనె.

96. రఘుకులతిలకుడు - మునినాధునిదరి
సెలవు గైకొని - బయలుదేరెను
సోదరసముడౌ - నిషాదాధిపుని
గృహమునకేగ - సెలవొసంగెను
చేతికిజిక్కిన - చింతామణిని
జారవిడచిన - అభాగ్యునివలె
రామచంద్రుని - పాదధూళిని
శిరసుననిడుకొని - పయనమాయెను.

97. అరణ్యమందున - అనుజలక్ష్మణుడు
మార్గముజేయుచు - ముందునడువగా
సీతారాములు - కడుసులభముగా
దుర్గమారణ్య - మార్గముగుండా
సొంపగుదృశ్యము - లెన్నోగాంచుచు
అమరావతియను - పురమునుదాటి
చిత్రకూటవన - భూములు జేర
చిత్తములలర - విశ్రాంతి బొందిరి.

**రాముడు వాల్మీకాశ్రమము జేరుట**

98. అంతటవినిరి - వేదనాదములు
కాంచిరిమువ్వురు - హోమానలములు
వల్మీకభవుని - ఆశ్రమమదియని
తెలిసినంతనే - సంతసించిరి
పుట్టమునియంత - స్వాగతమిడగా
తెలిపెనురాముడు - తనవృత్తాంతము
ఆపలుకులువిని - మునివాల్మీకి
ధన్యతగాంచెను - నాదుజననమనె.

99. ఓ మునివర్యా - చిత్రకూటమున
వాసయోగ్యమగు - స్థలమును జెప్పిన
పర్ణకుటీరము - నిర్మించుకొని
నివాస ముందుము - కొంతకాలమిట
అనిరఘువీరుడు - పలికినంతనే
ఆనందాశ్రులు - జలజలరాల
రఘువంశమునకు - రాజువునీవు
పరీక్షింపన - న్నడుగుచుంటివా?

100. వేదములను - రక్షించినవాడవు
నరరూపంబును - నీవుధరించి
ఆదిలక్ష్మిని - సీతగజేసి
ఆదిశేషుని - అనుజుగజేసి
ధర్మముగావగ - ధరజనియించిన
జగములనేలెడి - సూత్రధారివి
ఆదిమధ్యాంత - రహితుడవయిన
మీకు ఏస్థలము - జూపగలాడ

❀ ***వాల్మీకి రాముని కొనియాడుట***

101. నారాయణుడే - నరరూపముగొని
అడుగుటచేతా - చెప్పుచుంటిని
పవిత్రస్థలము - కడుమనోజ్ఞము
మందాకినిచే - పునీతమైన
చిత్రకూటము - కడుఅనుకూలము
గజసింహములు - స్నేహశీలమున
విహరించెడికడు - పుణ్యభూమియది
అత్రిమహాముని - మొదలగుమునులు
వాసరముండు - పుణ్యక్షేత్రమది.

102. వాల్మీకునికడ - సెలవ్వుగైకొని
మందాకినికి - ఉత్తరదిశను
ఉన్నభూమిని - రాముడుజేరి
ఆదరమొప్పగ - లక్ష్మణుగాంచి
వాస్తుశాస్త్రమును - విస్మరింపక
పంచభూతముల - సంస్మరించుకొని
నిర్మింపుము ఒక - పర్ణకుటీరము
కొంతకాలమిట - వాసముందము.

103. రామునానతిని - శిరమునదాలిచి
లక్ష్మణుడంతట - కట్టెలుకొట్టెను
ఆకులు తీగలు - చెట్టునారలు
పోగుజేసెను - పరిశుద్ధాత్మతో
గుంతలుత్రవ్వి - పర్ణశాలను
అతిసుందరముగ - అటనిర్మించి
ముకుళితకరుడై - సీతారాముల
పర్ణశాలలో - పాదములిడుడనె

104 స్నాన సంధ్యాదులు - ముగించిరాముడు
జానకి గూడి - నియమనిష్ఠలతో
వాస్తు దోషములు - పోవునట్టులా
శాస్త్రరీతిజప - తపములు జేసి
వనలభ్యంబగు - ఫలపుష్పమ్ముల
పూజలు సలిపి - పవిత్రుడాయెను
పురమువీడిన - చింతలుమరచి
పర్ణశాలలో - విశ్రమించిరి

❀ ***సుమంత్రుడు దశరథునితో అరిష్టములు దెలుపుట***

105. అంతసుమంత్రుడు - వెడలెనయోధ్యకు
రాముడులేని - అరదమునుగొని
సీతాసాధ్వియు - రామలక్ష్మణులు
చిత్రకూటమున - క్షేమంబనెడి
వార్తను తెలిపెను - దశరథేశునకు
తనకెదురయిన - దుర్నిమిత్తములు
విపులముగా - విశదీకరించెను
దశరథుడంతట - వారికి తెలిపెను
శ్రావణుపిత తన - కిడినశాపమును.

### ❀ దశరథుడు శ్రవణుని వృత్తాంతము దెలుపుట

106. వేటనిమిత్తము - నేనొదినమున
వనములకేగి - మాటువేసితి
రేయియంతయు - అటులగడుపగా
తెలతెలవారెడి - సమయమందునా
చెంతసరోవర - పాదలయందునా
హరినీరముగొను - శబ్దమునేవిని
శబ్దవేదిని - ప్రయోగింపగా
రివ్వునబాణము - ప్రాణికితగిలే

107. శరమును వదలిన - తదుపరిక్షణమున
హా! యనిగూలిన - మనుజస్వరము
కర్ణపుటములకు - సోకినంతనే
ఏగిచూడగా - మునికుమారుడట
రక్తపుమడుగున - తేలియాడుచు
కందమూలములు - తినిబ్రతికెడినను
శరమును వదలి - ఎవరు గూల్చిరని
పరిపరివిధముల - పరితపించెను.

108. నాపొరబాటును - మన్నింపుమని
మునిబాలకుని - వేడుకొంటిని
అందులకాతడు - తాశ్రావణుడని
మాతాపితరులు - పుట్టు అంధులని
వారిసేవలో - సకలసుఖములు
దివ్యజ్ఞానము - లభియించెనని
దప్పికగొన్న - వారికినీరము
తాగొనిపోగా - అటకువచ్చెననె.

109. తానికజలము - ఏవిధివారికి
గొనిపోగలనని - కడువిలపించెను
ఉత్తరదిశలో - ఉన్నపాకలో
తల్లి దండ్రులకు - జలమందించి
వారుతృప్తిగా - త్రాగినపిదప
తనప్రమాదము - వివరింపుమని
ఓంకారమును - చిట్టచివరగా
జేసిశ్రావణుడు - శమునునిజేరెను

110. మునిదంపతుల - కడువేదనవిని
వారికుమారుడ - కాదనితెలిపి
అజ్ఞానంబున - శ్రావణుద్వంచిన
దోషిని నేను - ధరణీశ్వరుడను
ననుమన్నింపగ - వేయివిధంబుల
వేడితినేను - మండనమునిని
మండనుడంతట - మహోఉగ్రుడై
పలుపలువిధముల - నిందించెనను.

❀ ఋషి దశరథుని శపించుట

111. తనయుడులేని - తనువెందుకని
తనకుమారుడు - నేలకొదగిన
ధరణీస్థలికి - తోడ్కొనిపొమ్మనె
మృతసుతు దేహము-నిమురుచు మునిపతి
చిన్నికుమారా - తీయనిపలుకులు
మాతోపలుకగ - కినుకపేలరా
అగ్నిహోత్రము - స్నానపానములు
ఎవరికజేతురు - ఓఅమలమతీ

112. ఒంటరివారము - తిరుగగలేము
నిత్యకర్మలు - సలుపగలేము
కందమూలములు - ఎవరుదెత్తురు
నిలుమోపుత్రా - కాలుని వీటికి
నీ వెంబడి బడి - మే వచ్చెదమని
అశ్రుధారలను - ఏకధారగా
ఏడ్వదొడంగిరి - అంధదంపతులు
అంతటముని - అపరాగ్నిహోత్రుడై

ధరణీనాధ - మావలెనీవు
పుత్రశోకమున - మరణించెదవని
శాపంబునిడి - అగ్నినిజొచ్చి
అరిగిరివారు - దివిజధామము

## దశరథుడు కాలధర్మము జెందుట

113. ఆశాపమె ఈ - శోకకారణము
కైకవరములకు - అదియేమూలము
ఇక ఎటుచూతు - రామునిమోము
ప్రథమతనయుడు - దరిలేకుండా
ఎటులచేరెదను - దివిజధామము
హా ప్రియపుత్రా! - లోకరక్షకా!
రామారామా - అనుచుదశరథుడు
రామునిదలచుచు - అసువులు వీడెను.

114. దశరథుమరణము - గాంచినంతనే
గొల్లున ఏడ్చెను - కౌసల్యాసతి
క్షణమాత్రంబున - పురజనులందరు
రాజభవనమును - జేరుకొంటిరి
కైకమూలమున - ధరణీశ్వరుని
గోల్పోయితిమని - కడుదూషించిరి
మునివసిష్టుడు - శాంతివచనముల
దశరథసతులను - ఊరడించెను.

### ❀ వసిష్ఠుడు భరతునికడకు దూతల ఒంపుట

115. గిరివ్రజపురమున - మాయుగృహంబున
విడిదిజేసెడి - భరతశత్రుఘ్నుల
పిలిపించమనె - మౌనివసిష్ఠుడు
రామవృత్తాంతము - దెలుపవలదనె
దశరథుమరణము - నుడువగవలదనె
రాచకార్యమున - రమ్మనిపిలువ
సిద్ధార్థవిజయాఖ్య - జయంతుల
భరతునికడకు - బయలుదేరమనె

### ❀ భరతుడు దుస్వప్నముగాంచుట

116. నిశిసమయంబున - భరతకుమారుడు
కడుక్రూరమగు - కలలనుగనెను
మరుసటిదినమున - వ్యాకులహృదితో
మిత్రబృందముల - జేరిభరతుడు
కుమిలి కుమిలి - దుఃఖంచుచుండగా
భరతుడుగాంచిన - స్వప్నముగూర్చి
వివరముగా - విశదీకరింపుమని
కోరిరిప్రియ - సఖులందరుజేరి.

117. తనజనకుండు - అతిమలినుండై
వాడినమోముతో - ముక్తకేశుడై
శైలమునుండి - పేడనుబడుట
తైలము ద్రావుట - అన్నముదినుట
తైలముతో స్నా - నమును జేయుట
సాగరములు శు - ష్కించిపోవుట
కువలయాప్తుడు - ధరణిని గూలుట
అంధకారము - జగమును మూయుట

118. పట్టపుటేనుగు - దంతముపడుట
లతాకుంజములు - ఎండిపోవుట
పుడమియంతయు - బీటలుపడుట
అగ్నిదేవుడు - శీతలమగుట
అగ్నిశిఖరములు - బ్రద్దలుఅగుట
వికృతాంగనతన - జనకునిమెడను
త్రాడుకుగట్టి - నీడ్వదొడంగుట
భరతుడు తలచుచు - కలతనొందెను.

119. భరతునిజేరి - దూతలు తెలిపిరి
గురువసిష్ఠుని - సందేశమును
దశరథనరపతి - కుశలవార్తను
రామలక్ష్మణుల - సౌఖ్యవార్తను
కులగురువసిష్ఠ - క్షేమవార్తను
కౌసల్యాసుమిత్రల - సంతోషవార్తను
కేకయపుత్రి - మోదవార్తను
భటులనుగాంచి - భరతుడడిగెను.

❁ భరతుడు అయోధ్యకు వచ్చుట

120. మామాతాతల - సెలవుదీసుకొని
భరతశత్రుఘ్నులు - పయనమాయిరి
ఏడురాత్రులు - ఏకధాటిగా
పుణ్యానదులను - పురములు వనములు
అధిగమించుచు - అయోధ్యజేరి
సోకతప్తమై - మునుగు నగరిని
కాంచినంతనే - కలవరపాటుతో
సూతునడిగెను - భరతకుమారుడు

121. సతతముపచ్చని - తోరణములతో
కలకలలాడెడి - సింహద్వారము
వెల వెలబోయెను - నేడదియేల?
గజాశ్వమ్ములు - కదలకమెదలక
తలలువాల్చుకొని - ఏలపరుండెను?
రాజవీధులా - రంగవల్లులు
దుమ్ముతో కూడి - ఏలనిండెనని?
భరతకుమారుడు - సూతునడిగెను.

122. రాజగృహముల - గవాక్షములన్నియు
మూసిజనులంత - ఎచటికేగిరి ?
రథమునుజూచి - పురజనులందరు
దుఃఖితులగుటకు - కారణమేమి?
రత్నసువర్ణ - అంగడున్నియు
మూసి వేయుటకు - కారణమేమి?
ఏదో అశుభము - జరిగియుండెనని
సూతునిగాంచి - భరతుడుపలికె

### ❀ భరతుడు కైకగృహమున కేగుట

123. కేకయరాజు - మనమడంతట
కైకగృహమ్మున - కాలుమోపెను
మాతకైకకు - అంజలియొనర్చి
తాతయుమామయు - క్షేమంబనెను
వారలొసంగిన - కానుకలన్నియు
దూతలువెనుక - తెచ్చుచుండగా
సప్తరాత్రములు - పయనముజేసి
వడివడిగానే - నిటకువచ్చితనె

### ❀ కైక భరతునకు దశరథు మరణముజెప్పుట

124. తనయునిజూచి - తన్మయమొంది
ఎన్నిదినములకు - చూడనోచితినో
నీదుజనకుడు - దశరథేశ్వరుడు
ధరణినివీడి - దివినిజేరెనను
ఘోరవార్తను - వినిన భరతుడు
హా! జనకా! యని - నేల గూలుచు
నీవులేని ఈ - అయోధ్య అంతయు
శూన్యంబేకద - నామనమునకని
పొరలిపొరలి - దుఃఖించెనాతడు.

125. అంత్యకాలమున - చెంతననిలిచిన
రామలక్ష్మణులు - కడుధన్యులుగద
మేమిరువురము - నిర్భాగ్యులము
చివరి క్షణమున - ప్రాణసమానుడు
రామచంద్రునికి - ఏమి చెప్పిరో
అని పలికెడి ఆ - భరతునిగాంచి
జనకుని ఆనతి - శిరమునదాలిచి
రాముడుసీతా - లక్ష్మణులగూడి
నారడవులకు - ఏగెనని తెలిపె.

❀ *భరతుడు కైకను నిందించుట*

126. కరుణయొకింతయు- లేకమనమ్మున
క్రూరపుబుద్ధిని - ఏలబూనితివి
ధర్మచిత్తుడు - ధరనుత్తముడు
దశరథరాముని - నాదుఅనుజుని
దండకాటవుల - పంపగనేలా
నాకుపట్టమును - గట్టగనేలా
ఇట్టి వరములు - జనకుని కోరగ
మన నెటులొప్పెను - ఓసిరాక్షసి

127. అగ్నికణములు - కన్నులరాల్చుచు
కైకనుకడుదు - ర్భాషలాడుచు
మాకులమందున - ప్రథమకుమారుడు
తమ్ములకెల్ల - జనకసమానుడు
కోసలాత్మజకు - కడుఇష్టుండు
పుత్రశోకము - కడుదుర్భరమని
పరుసములాడి - పాపమ్మనైకైకను
వాపోవమనె - తనుతెగినాడని

భరతుడు కౌసల్యను జూచుట

128. కైకనువీడి - భరతకుమారుడు
కౌసల్యాసతి - సదనముజేరగ
కటికనేలపై - కన్నీటనుబడి
రామా! యనుచు - రోదనజేయుచు
ఓ కైకాసుత - నీవు కోరిన
రాజ్యలక్ష్మిని - ఏలుకొనుమిక
పంపుమునన్ను - దండకాటవుల
నాసుతుజేరి - సౌఖ్యమొందెద

129. విలంబమేల - నీవుజేసెదవు
జననిమూలమున - సముపార్జించిన
తురగగోధన - మత్తగజంబుల
పరిపూర్ణంబగు - వసుధాస్థలిని
పాలనజేయుము - కడుయధేచ్ఛగా
నీశీలమును - కైకశీలమును
సర్వజగములా - చెప్పకొనెదరూ
అనినిష్ఠూరము - లాడెభరతుని

130. అంతభరతుడు - మనమునక్రుంగి
కౌసల్యాసతి - పాదములంటి
అంజలిఘటించి - ఇటులపలికెను
మనమునమాతా - కినుకవీడుము
నాపలుకులను - విశ్వసింపుము
తాతగారిదరి - నున్ననాకెవరు
ఇచటివిషయములు - తెలియబరతురు
నాకు తెలిసిన - దుర్గతిపొందెద

❀ కౌసల్య భరతునోదార్చుట

131. పలుపలువిధముల - శపథముజేసి
తాపముతో భూ - స్థలినిగూలిన
భరతకుమారుని - కౌసల్యాసతి
తనబాహువుల - గ్రుచ్చిఎత్తెను
తనఅంకమ్మున - పరుండబెట్టి
ఎన్నో విధముల - సేదదీర్చెను
విషయముతెలిసి - మునివసిష్ఠుడు
మంత్రిసుమంత్రుని - తోడవచ్చెను.

132. పితృవియోగము - పొందుభరతుని
జూచిపలికెను - మునివసిష్ఠుడు
పుట్టుకఅన్నది - గిట్టుటకొరకని
తెలిసియుకూడ - వగవగనేలా
చింతనువీడి - చేయుమునీవు
ప్రీతిగజనకుని - ప్రేతకార్యము
ఆకార్యమునకు - వలయువస్తువులు
సమగూర్చితిమి - భరతకుమారా

### దశరథుని అంతిమయాత్ర

133. కనకమువెండియు - నవరత్నములు
రజతటంకములు - ముత్యములెన్నో
దశరథభూపతి - మృతదేహమ్ము
అరుగుచుండగా - వెదజల్లిరియట
గంధసుగంధ - విశేషధూపములు
జనులంద్రరును - వేయుచుండగా
ప్రేతభూమికి - క్ష్మాపతిదేహము
జేర్చిరిజనులు - కడుదుఃఖమ్మున

134. జనపతికాంతలు - విషాదభరమున
పల్లకీలలోజనె - మరుభూమికి
ఋత్విజులంత - చదువమంత్రములు
చందనగంధపు - చెక్కలతోడ
కాష్టముజేసి - దశరథుజేర్చగ
ప్రజలెల్లరును - బోరునఏడ్చిరి
భరతుడంతట - ప్రదక్షిణజేసి
అనలము వెట్టెను - జనకునిచితికి

135. పురమున జేరిన - భరతకుమారుడు
శాస్త్రరీతిని - శ్రాద్ధకర్మను
పదిదినంబులు - ఆచరించెను
ఏకాదశమున - శుద్ధినిబొంది
ధనధాన్యంబులు - గోసహస్రములు
వనములు భూములు - వస్త్రదానములు
గృహదానములు - ౹ జదానములు
ఒసగెద్విజులకు - భరతశత్రుఘ్నులు.

*దశరథునిగూర్చి భరతుడు చింతించుట*

136. త్రయోదశిదినమున - వెడలెభరతుడు
తండ్రిఅస్థికల - సంచయనమునకు
ఆదశరథుని - భస్మరాసిపై
దృష్టినినిలిపి - ఇటులపలికెను
కోరినవన్నీ - కోటివిధంబుల
ప్రేమమీరమా - కిచ్చెడివాడవు
బుద్ధులు సద్దులు - మాకునేర్పుచు
కరుణతోడ - పాలించేవాడవు.

141. వనములకేగిన - రాముడులేక
జీవించుట - కష్టంబనిఎంచి
కరుణనువీడి - నన్నురామునికి
అప్పజెప్పచు - అనిమిషలోకము
ఏగినాడవో - జమహీపతి
తలచినకొలది - ధారుణియంతయు
పగిలినచందము - తోచుచున్నది
మమ్ముజూచెడి - వారలెవరిక

142. భరతుడటుల - విలపించుచుండగా
శత్రుఘ్నుడుకడు - శోకచిత్తుడై
తండ్రిగుణములను - మరిమరిదలచి
సొమ్మసిలిపడె - ధారుణిపైనా
మునివసిష్ఠుడు - సాదరంబుగా
కాలగతుల ధ - ర్మంబులుదెలిపి
రాజతనయులకు - సేదనుదీర్చి
పితృమేధమును - పూర్తిజేసెను.

143. గృహమునుజేరిన - భరతునిగాంచి
శత్రుఘ్నుండు - ఇటులపలికెను
దేశవాసులగు - జీవులందరకు
తావలమ్ముశ్రీ - రామచంద్రుడు
సత్యధర్మవి - స్ఫూరితుడాతడు
తరుణిమాట విని - దండకాటవికి
ఎట్టులేగెనో - అయోధ్యవీడుచు
అనిపరివిధముల - ఖిన్నుడాయెను

※ **ద్వారపాలకుడు మంథరను అప్పజెప్పట**

144. తూరుపు దిక్కున - ద్వారముదాపల
కనకోజ్వల - భూషణములు దాల్చి
నవ్యచేలములు - మేనునదాల్చి
మర్కటంబువలె - మంథరదాది
పొంచివినెను శ - త్రుఘ్నునిపలుకులు
అదిగాంచిన ఒక - ద్వారపాలకుడు
ఆమెనుబట్టి - లక్ష్మణభ్రాతకు
అప్పజెప్పుచూ - ఈ విధిపలికెను.

145. శ్రీరఘురాముడు - జనకతనూజయు
భ్రాతలక్ష్మణుడు - కాన కేగుటకు
దశరథభూపతి - మిత్తినిబడుటకు
మాతకైకేయి - మనసుమారుటకు
ముగ్గురుతల్లుల - విధవరికమునకు
అయోధ్యవాసుల - అశ్రుధారలకు
కారణమ్ముఈ - దాదిమంథర
తగినశిక్షను - విధింపుడనెను.

❀ *శత్రుఘ్నుడు మంథరను దన్నుట*

146. ఆమాటలువిని - సుమిత్రసుతుడు
దాసిమంథరను - ధరణినిద్రోసి
కురులనుబట్టి - ఈడ్వదొడంగెను
వనితనిచూడక - వధియించెదనని
ప్రాణములను అర - చేతబట్టుకొని
తనను బ్రోవుమని - పాదములంటెను
పలుపలువిధముల - రక్షణవేడెను
తననుదయతో - మన్నింపగవేడెను.

147. అంతభరతుడు - అనుజునడ్డుకొని
తప్పులన్నిమం - ధరవుకావని
చెప్పినమాటల - మంచిచెడులను
విచారించని - తనమాతవనె
శిక్షవిధించిన - తొలుతకైక కని
అటుపిమ్మట - ఈదాసిమంధరకు
అయినావీడితి - వీరిరువురను
స్త్రీజాతికిచెం - దినవారగుటచే

※ **రాజకర్తలు భరతునభిషేకమునకై వేడుట**

148. రాజులేని ఏ - రాజ్యమైననూ
అరాజకమ్ము - చవిచూచునని
మంత్రిసామంత - దండనాధులు
వసిష్ఠాదిముని - ముఖ్యులందరూ
రాజ్యభారమం - గీకరింపుమని
భరతునడిగిరి - బహువిధంబులా
అదివిని భరతుడు-హృదయభారమున
వారినిగాంచి - ఇటులపలికెను.

**భరతుడు వసిష్ఠాదిమునులను గాంచి తనమనో వేదన తెలియబరచుట**

149. ఏరాజ్యరమ - పతితపావనుని
కాననవాసము - పాలుజేసెనో
ఏరాజ్యరమ - కడుధర్మాత్ముని
వృద్ధభూపతిని - దివికి బంపెనో
ఏరాజ్యరమ - నా మాతలకు
వైధవ్యమును - కలుగజేసెనో
ఏరాజ్యరమ - ప్రజలందరినీ
కఠినదుఃఖమున - కృంగదీసెనో
అట్టిరాజ్యమును - పొందగనేను
మనమునందు - వాంఛింపనెన్నడు

150. అనివగచుచు ఆ - భరతకుమారుడు
వసిష్ఠాదిముని - ముఖ్యులగాంచుచు
క్రూరురాలగు - కైకగర్భమున
జనియించుటచే - శిక్షకర్హుడని
ఈరాజ్యమ్మును - ఈభరతునకు
అప్పజెప్పుట - సరియగుశిక్షని
మీరందరునూ - ఊహించితిరా?
అయోమార్గమున - నన్నునడపుటకు
దీక్షవహించి - అటులపలికిరా!

151 కావున మీరు - నా అగ్రజుడగు
రామచంద్రుని - దరి కంపించిన
వానిపాదములు - నేసేవించుచు
వాని మార్గమున - నడచితరింతును
క్షణమైనను ఈ - అయోధ్యయందున
నిలువగలేనని - మునివసిష్ఠుని
వనములకేగ - అనతీయుడని
పాదములంటి - భరతుడడిగెను

152. మాతృదేవత - కౌసల్యనుగని
కుటిలురాలయిన - కైక గర్భమున
జనియించినఈ - భరతుక్షమింపుము
రాజవంశమున - ప్రథమ కుమారుడు
రాజ్యరమనుచే - పట్టుటధర్మము
కావున ఇపుడే - అడవులకేగి
రాముప్రార్థించి - తోడ్కొనివచ్చి
అభిషిక్తునిగా - నేజేసెదనని

153. నినుగనియైనా - రామవియోగము
కొంతదనుక - నేమరచిపోతిని
నీవు లేక ఈ - అయోధ్యయందున
ఎవరినిమిత్తము - నేనుండవలె
కావుననేను - నీవెనువెంటగ
అడవులకొచ్చి - రాముజూచెద
శేషజీవితము - గడపినపిమ్మట
చివరిశ్వాసనే - విడుతురాముకడ
అనిపలికెను ఆ - కౌసల్యాసతి

154 ప్రాణసమానుడు - రాముడురానిచో
లక్ష్మణునివలె - దీక్షనుబూని
రామునిసేవలో - ధన్యతజెందుచు
వసియించెదనే - వనములందునా
అటులుగాకరఘు - రాముడవచ్చెనా
కాననమందు - మార్గమేర్పరచ
కార్మికావళుల - నేబంపించితి
అనిపలికెడి - ఆభరతునిగాంచి
పురజనులందరు - మోదమొందిరి

155. వందిమాగధులు - స్తోత్రముజేయగ
దుందుభిధ్వనులు - పిక్కటిల్లగా
శంఖారవములు - ప్రతిధ్వనింపగ
భరతుడులేచి - ఇటులపలికెను
నేను గాదు మీ - నరపతినిప్పుడు
నన్నిటుపొగడుట - న్యాయముగాదు
తరలిరండుఓ - పురజనులారా
సీతాపతిని - వేడు కొనుటకు

156. భరతుని పలుకులు - వినిజనులందరు
మోదముతో - జేజేలు కొట్టిరి
చంద్రవదనుసు - శ్యామల గాత్రుని
కమనీయాక్షుని - దీర్ఘబాహుని
చారునాసికుని - శోకవినాశుని
కడుసుందర - సుగుణాలవాలుని
కౌసలేయుని - గాంచుటెప్పుడని
తహతహలాడిరి - జనులందరును

157. ఉత్తమాశ్వముల - రథమునుఎక్కి
భరతుడంతట - బయలు వెడలెను
సచివోత్తములు - గురులు బంధువులు
వారివెనుకగా - భటుసముదాయము
అటుపిమ్మట గజా - శ్వదళమ్ములు
ముగురుమాతలు - పల్లకీలలో
శ్రీరఘురాముని - గుణగణాదులు
పొగడుచుసాగిరి - భరతునివెంట

❀ *గుహుడు భరతుని సందేహించుట*

158. ఆ విధముగపయ - నించినవారలు
పావనగంగా - తీరముజేరి
శృంగి బేరమున - విశ్రమించిరి
రామచంద్రుని - సఖుడగుగుహుడు
భరతునిగాంచి -సందేహించెను
విషయమరయుట - తనధర్మమని
రాయబారులను - బంపిభరతుని
దర్మనభాగ్యము - కలుగ జేయుమనె

### ❀ గుహుడు భరతుని దర్శించుట

160. దూతలపలుకులు - వినినభరతుడు
కడుసంబరమున - అనతినొసగెను
గుహుడంతట - బాహువులుకట్టుకొని
మధురఫలములు - భక్ష్యభోజ్యములు
కోకొల్లలునే - మీకర్పింపగ
గొనివచ్చితిని - ఓమహరాజా
ఈ రేతిరి ఇట - వసింపవేడెద
దాసునికోరిక - తగదనిపలుకకు

161. భవ్యచరితుడు - భరతకుమారుడు
నిషాదాధిపతి - పలుకులనువిని
తనతోవచ్చిన - బంధుజనులను
రథగజతురగ - పదాతిదళమ్ముల
ఈ భాగీరధి - ఎటుదాటింతువో
అటుపిమ్మట - ఆభరద్వాజముని
ఆశ్రమభూమిని - జేరుమార్గము
నుడువుమునీవు - నిషాదరాజా

162. ఆపలుకులువిని - గుహుడిటులడిగె
ఏ కారణమున - బలములుగొనుచు
యుద్ధరీతిగా - రామునికడకు
ఏగుచుంటివో - భరతకుమారా
అనిప్రశ్నింపగ - భరతుడాతనితో
నా అగ్రజుని - వనములనుండి
తిరిగి దెచ్చిజన - సమ్మతిమీరగ
రాజ్య పీఠమున - నిలుపదలచితి
ననుదుష్టునిగా - నెంచకుమా అన

 *గుహుడు భరతునకు రాముడు శయనించిన స్థలము జూపుట*

163. సందియముడిగిన - రామునిమిత్రుడు
పరిపరివిధముల - భరతునిపొగడి
భ్రాత లక్ష్మణుని - గుణములుపొగడి
నింగుదితరువు - మూలముజేరి
సీతారాములు - నిశిసమయంబున
నిదురించిన కుశ - శయ్యను జూప
బాష్పకణమ్ములు - జలజలరాలగ
అంజలిఘటించె - భరతకుమారుడు

164. తరుచ్ఛాయలు - ప్రాసాదముగా
కారడవులు ఉ - ద్యానవనముగా
కరకుదర్భలు - పట్టుపాన్పుగా
పక్షులకూతలు - మంగళధ్వనులుగ
హోరుగాలియే - వింజామరగా
కాకారవములె - స్తోత్రమ్ములుగా
ఎంచితలంచెన - నాఅగ్రజుడని
కైకసుతుడు కడు - ఖేదమునొందె

165. దైవగణములను - దిక్పాలురను
నవగ్రహములను - పంచభూతముల
మరిమరివేడెను - కైకతనయుడు
తనపాపమునకు - నిష్కృతిలేదని
రఘురామునిపా - దములబడెదనని
తననిబ్రోవనిచో - మునివలెవనిలో
నారవస్త్రములు - జడలుధరించి
పదునాల్గేండ్లు - గడపెదననెను.

166. ఆవిధిప్రతినను - బూనిభరతుడు
రాత్రియంతరఘు - రామునిదలచుచు
తెలతెలవారెడి - సమయమందున
నిషాదపతిని - నావలుతెమ్మనె
మునిజనబంధు - భటసమేతముగ
భరతుడుదాటెను - గంగానదిని
జేజేలయ్యోఓ - భరతయ్యా
అనిబహురీతుల - పొగడెనుగుహుడు

※ *భరతుడు భరద్వాజుని ఆశ్రమంబు జేరుట*

167. ప్రయాగక్షేత్రము - జేరినపిమ్మట
రథగజతురగ - పదాతిదళమ్మును
తనజనమ్మును - వనమునఉంచి
గురువసిష్ఠుని - పురోహితులను
తోడుగైకొని - తపోవృద్ధుని
దేవగురుసముని - భరద్వాజుని
ఆశ్రమంబును - జేరగవెడలెను
పాదాచారిపై - భరతకుమారుడు

168. ఆశ్రమవాటిక - జేరినవారిని
గాంచినంతనే - కడువేడుకతో
ఆసనంబుదిగి - భరద్వాజముని
అర్ఘ్యమీయగా - శిష్యులబంపి
వసిష్ఠమునిక - భివాదముజేసి
వానిచెంతనిలు - చున్నవానిని
భరతాఖ్యునిగా - మదిలోనెంచి
సముచితరీతిని - సత్కారించెను

❀ *భరద్వాజుడు భరతుని నిందించుట*

169. కుశలప్రశ్నలు - అయినపిమ్మట
భరద్వాజుడు - భరతునడిగెను
ఈ విధంబుగా - బంధుజనులతో
అరుదెంచుటకు - కారణమేమి
వనితకులోబడి - భూవరుడంపెను
శ్రీరఘురాముని - వనవాసమునకు
కడునిర్భాగ్యుడు - నీజనకుండని
కడునిందించెను - భరద్వాజుడు
ఆపలుకులువిని - హా! జనకాయని!
భరతుడిటుపలికె - భరద్వాజునితో

170. రాముడులేని - రాజ్యమంతయు
ప్రాభవహీనత - చెందియున్నది
పాపార్జితమగు - వసుధాస్థలిని
ఏలుకొనుటయా - సంతసంబునా
కైకసుతునిగా - పుట్టుటచేత
పాపములనునే - మూటగట్టితిని
రామచంద్రుని - పాదపద్మములు
సేవించుటకే - పయనమయితిననె

భరద్వాజుడు భరతునోదార్చుట

171. ఆ పలుకులువిని - భరద్వాజముని
విషయములన్నీ - నాకువిదితము
నీమనంబును - అరయుటకొరకు
అటులపలికితిని - విచారింపకు
కైకదోషమి - సుమంతయులేదు
రాముడామెకు - ఆరవప్రాణము
దైవసంకల్ప - కారణంబుగా
కైకకుమాయ - అటుకమ్మెననె.

### ❀ భరద్వాజుడు భరతుని పొగడుట

172. ఓ భరతానీ - సురుచిరకీర్తి
ముల్లోకములకు - ప్రాకిపోవును
ఎవరునీకీర్తి - గానముజేసిన
వారికెల్లఘన - కీర్తివచ్చును
శ్లాఘనీయము - నీ ఉద్యమము
సర్వోత్కృష్టము - సర్వమంగళము
శ్రీరాముని ప్రియ - సోదరుడనెడి
సార్థకనామము - నీకుకలుగును.

### ❀ భరద్వాజుడు భరతునకు విందుజేయుట

173. నీవునుతల్లులు - శత్రుఘ్నుడును
పరివారంబులు - మంత్రివర్గములు
కడుమోదంబున - ఈనిశియందున
నా ఆశ్రమమున - విడిదినిజేసి
నా ఆతిథ్యము - స్వీకరింపుడని
భరద్వాజముని - పలికినంతనే
వనలభ్యంబగు - ఫలములన్నియు
అర్ఘ్యపాద్యములు - మోదముగూర్పగ

ఉన్నత రీతిని - ఒసగినారుగద
తాపసోత్తమా - అనెనుభరతుడు
చిరునగవులుచిం- దించిమునివరుడు
స్వల్పమిచ్చితిని - న్యాయముగాదది
సర్వసైన్యములు - పరిచారకులు
ముదముమీరగా - శాకపాకములు
ఆరగించినను - తృప్తిపరచగా
గోరుచుంటిని - దశరధనందన

శ్రీరాముడు, సీతకు చిత్రకూట చిత్రంబు జూపుట

174. రఘుకులతిలకుడు - సతిజానకితో
చిత్రకూటవన - భూములతిరుగుచు
అందునందుగల - అందములన్ని
వివరముగావి - శదీకరించుచూ
సుజనవర్గమును - బంధుజనమును
వీడినచింత - తనమనంబున
ఇసుమంతయును - లేదనితెలిపెను
సీతమనసు - రంజింపజేయుగా

175. రమణీయంబగు - పర్వతసానుల
నింగినితాకెడి - భూరుహతతులను
వింతవింతలుగొల్పు - మృగములను
లేచిగురాకుల - పూలపొదలను
సోయగములూరు - పక్షిగణంబుల
జూపుచురాముడు - కిన్నెరప్రమదలు
భర్తలగూడి - దివారాత్రములు
రమణీయముగా - అటగడిపెదరనె.

176. నీవులక్ష్మణుడు - తోడుగనిలచిన
రాజ్యభారము - భరతుడునడుపగ
శతవర్షమ్ములు - వేడుకమీరగా
ఫలపుష్పముల - నదీనదముల
పలుపలురకముల - పక్షిగణముల
కనులకు ఎంతో - విందుజేసెడి
ఈ వన భూముల - నుండదలచితి
చింతలుమరచి - పద్మలోచనీ

177. మునుమాపూర్వులు - తెలిపి రెంతయును
రాజవరేణ్యులు - కొంతకాలము
వనవాసంబును - సలుపవలెనని
అదియేవారి - గరిష్టధర్మమని
దానివలనదై - వత్వమొచ్చునని
పాపమ్ములు హ - రియింపబడునని
కావున ఈగతి - సంప్రాప్తించెను
కాననవాసము - మనకిటులనియె.

178. అటుపిమ్మట - ఆదాపలనున్న
జాహ్నవీనదిని - జూపెజానకికి
దానిమహోత్మ్యము - తెల్పెదాశరధి
తపోధనులను - శమదమాన్వితులు
అగుఋషులందరు - అనుదినంబునా
ఈతటియందున - స్నానములాడి
వారికలుషములు - బాపుకొందరు
కావున ఈమెను - దైవనదియని
పిలుచుచుందురు - లోకోత్తరులు

179. ఆవిధంబుగా - గంగగౌరవము
జనకజనుతకడ - నుడువుచుండగా
ఘోరభయంకర - నాదమొక్కటి
కాననమందున - రాముడువినెను
వన్యమృగంబులు - ప్రాణభీతితో
నాలుగుదిక్కుల - పరుగిడసాగెను
పదములతాకిడి - రేగిన ధూళి
గగనభాగమున - కెగయుటగాంచెను.

180. ఇనవంశాంబుధి - సోముడంతట
లక్ష్మణుగాంచి - ఇటులపలికెను
నరపతిఎవరో - వేటాడుటకై
వచ్చియుండెనని - తోచుచున్నది
పక్షులన్నియు - నింగికెగసెను
వన్యప్రాణులు - పరుగిడుసాగెను
కావుననీవు - పరిశీలించి
అతిశీఘ్రముగా - తెలియబరచుము

181. రామున్నాజ్ఞను - గొనిలక్ష్మణుడు
దరిలోనున్న - సాలవృక్షమును
గ్రక్కునవెగసి - తూర్పున జూచెను
తదుపరిఉత్తర - దిశను జూడగా
దారుణసైన్యము - దరిలోగాంచెను
శ్రీరామునిగని - ఆర్పుమువహ్నిని
శరాసనమ్మును - ఎక్కుబెట్టుము
వదినజానకిని - గుహకుపంపుమనె



***భరతుడు సైన్యముతో వచ్చుచుండెనని లక్ష్మణుడు రామునితో జెప్పట***

182. ఆపలుకులు విని - రాముడిటులనె
సైన్యమెవరిదో - కనుగొనిచెప్పుము
చింతనిప్పులే - కన్నులరాలగ
కలుషాత్ముడగు - కైకసుతుండు
రథగజతురగ - పదాతిదళమ్ముల
వెంటనిడుకొని - బలదర్పంబున
రణమునందునిను - హతమొందించగ
ఇటకువచ్చెనని - పలికె లక్ష్మణుడు.

183. అనుజా రామా - ఆనతినీయుము
భరతాధముని - నేవధియించెద
రాజ్యకాముకగు - ఆకైకేయిని
కాలుపురమునకు - నే బంపించెద
అడ్డగించిన - సైన్యమునంతను
అరనిముషంబున - త్రుంచివేసెద
చిత్రకూటనగ - భూములవెంబడి
రక్తపుటేరుల - పారించెదననె

## ❀ రాముడు లక్ష్మణుని శాంతింపజేయుట

184. శ్రీరఘువీరుడు - మందహాసమున
అర్ధనిమీలిత - లోచనుడగుచు
ధర్మచిత్తుడు - భవ్యగుణుండు
భాతృవత్సలుడు - భరతకుమారుడు
రాజ్యభారమును - నాకునీయగా
మదిని దలంచి - వచ్చుచుండెను
కావుననీవు - శంకనువీడుము
సాలముదిగుము - ఆహ్వానింపుము

### ❀ భరతుడు రామాశ్రమము జూచుట

185. గుణధాముడురఘు - రామునిజూడగ
సచివోత్తములు - గురులు బంధువులు
వెంటనడువగా - భరతకుమారుడు
రామనామమే - మనమునదలచుచు
చిత్రకూటమున - పర్ణశాలను
గాంచినంతనే - పరవశించుచూ
ఇదియేరాముని - ఆశ్రమమనుచు
పాదచారియై - పరుగులుదీసెను.

### ❀ భరతుడు శ్రీరాముని దర్శించుట

186. కృష్ణాజినమే - ఉత్తరీయముగ
దర్భాసనమే - సింహాసనముగ
భూమినివిగసిన - ధూళియంతయు
ఘనసారంబగు - చందనముగను
జటామండలమె - సుమమాలలుగా
వెలయుచున్న - ఆప్రశాంతమూర్తిని
గాంచినంతనే - భరతశత్రుఘ్నులు
కడిగెపాదములు - కంటినీటితో

### ❀ శ్రీరాముడు భరతుని కుశలప్రశ్న వేయుట

187. ఇనకులతిలకుడు - ఇద్దరుతమ్ముల
తనివిదీరతన - కౌగిటజేర్చి
తుడిచెనసువులు - తనకరములతో
కడువృద్ధుండగు - ధరణీనాధుని
ఒంటిగ విడచి - మీరిరువురును
కాంతారంబుల - కేలవచ్చిరి
అయోధ్యజనులు - క్షేమమేగదా
అని అడిగెను ఆ - రఘుకులసోముడు

### ❀ దశరధుని మరణవార్త విని శ్రీరాముడు దుఃఖించుట

188. కరములు మోడ్చి - కైకకుమారుడు
అశ్రుధారలు - జలజలరాలగ
ఇనకులంబును - ఇడుమునద్రోసి
నీనామంబును - స్మరియించుచును
ధరణీశ్వరుడగు - దశరధరాజు
అరిగెనుతాను - అమరపురికనె
ఆపలుకులు చెవి - సోకినంతనే
రాముడు కూలెను - భూరుహమువలె

189. ధరణీజాతయు - భ్రాతలక్ష్మణుడు
సీతలనీరము - ముఖమునచిలుకగ
అతిదీనముగా - అందరిగాంచి
పితృపాదుల - శ్రార్ధవిధులను
జేయలేనిని - ర్భాగ్యుడనైతిని
ధన్యజీవులు - భరతశత్రుఘ్నులు
సకాలమందున - సలిపిరివిధులు
అనుచురాముడు - దుఃఖితుడాయెను.

190. చిరుతప్రాయమున - అంకభాగమున
మోదము మీరగ - కూర్చొనబెట్టి
శుభప్రదమగు - పలుకులు చెప్పగ
వీనులవిందుగ - వినెడివాడవు
అనికడువగచుచు - సీతనుగాంచి
నీదుమామతః - వసుధవీడెను
లక్ష్మణమనకిక - జనకుడులేడు
భువిలోమనకిక - దిక్కెవ్వరనె

191. అనివగచెడి - రఘురామునిజూచి
విమలచరితుడు - మంత్రిసుమంత్రుడు
తనకరములలో - రామునిడుకొని
పరిపరి విధముల - సేదనుదీర్చి
నరపతినిన్నే - మరిమరిదలచుచు
శ్వాసవిడిచెను - చివరిసారిగా
నీవుతర్పణము - లిచ్చినగాని
జనకునాత్మకు - శాంతిలభింపదు.

❀ **రామలక్ష్మణులు నివాపంబులిచ్చుట**

192. సుమిత్రసుతుడు - ధరణీపుత్రి
వెంటనడువగా - రఘువరుడరిగె
జాహ్నవీతటి - తీరమందునా
మూడుమారులు - ముువ్వురుమునిగి
దోసిటనిండుగ - జలములుతీసి
మనమునందుదశ - రథుని దలచుచు
దక్షిణదిశగా - నిలుచొనివారు
దుఃఖభారమున - ఉదకములొదలె

193. ఇంగుది భూరుహ - పిష్టపిండముల
జనకభూవరుని - పుత్రికబెట్టగ
ధరణీనాథుగ - భోగములెన్నో
భోగించిన ఓ - జనకానేడు
నాకువనంబున - లభియించిన
ఈ గారపిండములు - ప్రీతినిగైకొని
చిరతరమైన - సుఖములు జెందుము
నాకమునందని - రాముడుపలికె

194. శుద్ధిస్నానములు - ముప్వురుజేసి
అరిగిరివారు - పర్ణశాలకు
ముగ్గురమ్మలను - గాంచినంతనే
సీతారాములు - లక్ష్మణుడంతట
వారిపాదముల - కంజలినొసగె
మునివేషంబున - ఉన్నరాముని
శుష్కించిన ఆ - సీతాసాధ్విని
లక్ష్యసిద్ధితో - నున్నలక్ష్మణుని
గాంచినంతనే - కడుచింతించిరి

### శ్రీరాముడు భరతుని రాకకు కారణమడుగుట

195. రామలక్ష్మణ - భరతాదులట
కొలువుదీరి - కూర్చుండిరంతట
భరతునిగాంచి - రాముడడిగెను
ఈవనికేల - మీరువచ్చిరని
నాదగుజనని - కారణంబుగా
నరనాధుండు - వంచితుడాయెను
కాననములకు - నినుబంపించి
జేరెనాతడు - దివిజధాయము

196. పౌరజనంబులు - సఖులు బందుగులు
మాతలు మంత్రులు - గురువరేణ్యులు
నిన్ను జూడ ఈ - ఘోరాటవులకు
అరుగుదెంచిరి - కడుప్రయాసతో
కాననవాసము - ఇక విరమించుము
నానిందలను - తుడిచివేయుము
రాజ్యభారమును - స్వీకరింపుమని
భరతుడురాముని - మరిమరి వేడెను.

197. వంశపారముగ - వచ్చెడిరాజ్యము
ఏలుటకర్హుడు - జ్యేష్ఠ తనయుడు
నేకనిష్టుడను - ఏ విధంబుగా
రాజ్యపాలనకు - అర్హుడౌదును
ధరణీశ్వరునిగ - నీవుండినచో
నీదాసునిగా - నేనుండెదను
జనులకోర్కెను - జవదాటకయా
భానుకులాంబుధి - చంద్ర అగ్రజా!

❀ శ్రీరాముడు భరతుని నిర్దోషిగా తెలుపుట

198. భరతునిపలుకులు - వినినరాముడు
సాత్వికుండవు - స్థిరవ్రతుడవు
ధర్మాత్ముడవు - కడుకోవిదుడవు
దోషమించుకయు - లేదు నీవలన
జనకుని ఆజ్ఞను - శిరమునదాల్చి
వనభూములకు - అరుగుదెంచితిని
జనకుని ఆనతి - జవదాటనని
నీ వెరుగవటో - భరతకుమారా

199. కావున ఏగుము - అయోధ్యపురికి
శత్రుఘ్నుడునీ - తోడునుండగా
రాజ్యరమనుచే - పట్టి సుఖింపుము
పాలింపుముప్రజ - లందరు బాగడగ
దివిజలోకము - జేరిన జనకుని
మాటనిలుపుట - ఇక నీ ధర్మము
పదునాల్గేండ్లు - వనమునగడపి
అటుపిమ్మట - నేనయోధ్యజేరుదు
అనిపలికెను రఘు - రాముడప్పుడు

**భరతుడు రాముని రాజ్యపదవి చేబట్టమని ప్రార్థించుట**

200. ఆ పలుకులువిని - భరతుడిటులనె
కడువేగముగల - తురగముమాదిరి
గార్ధభమెటుల - పరుగుతీయును
గరుడునివోలె - గగనమందునా
కాకమెటుల - విహరించగలుగును
అయోధ్యరమను - పాలించుటకై
సరియగు సారథి - నీవెగదయ్యా
మోదమార్గమున - యోచనజేసి
నా విన్నపము - మన్నించుమయా.

### ❀ భరతునకు రాముడు ధర్మమార్గములు దెలుపుట

201. తనకుతోచిన - దారినితానుగ
పోలేడిలలో - ఏమానవుడు
గతజన్మంబున - చేసినకర్మల
అనుభవించవలె - ఈజన్మమునా
నలువగీచిన - గీతనుతుడుచుట
సాధ్యంబగునా - ధరనెవ్వరికి
నిశ్రీరాముడు - ఆభరతునకు
ధర్మములను - వివరించిచెప్పెను.

### ❀ శ్రీరాముడు జాబాలికుత్తర మిచ్చుట

202. జాబాలి అను - విప్రపుంగవుడు
నాస్తికతనురఘు - రాముతోచెప్పెగ
అదివినిరాముడు - ఆవిప్రునకు
మునివరశ్రేష్టులు - సచ్చరిత్రులు
అధోమార్గమున - సంచరింతురా
అనిరోషముగాని - తగినరీతిని
సనాతన ధర్మము - లెన్నోజెప్పగా
తననుక్షమింపగ - వేడెరఘువరుని

## భరతుడు శ్రీరాముని పాదుకలడుగుట

203. పలుపలువిధముల - వేడినగాని
నీమనంబును - మార్చకపోతిమి
కాంచనాంచిత - భూషితములవలె
వెలుగొందెడి - నీదివ్యపాదుకలు
కూరిమిమీరగ - నాశిరమందున
దాలిచినేగెద - అయోధ్యపురికి
వాటి నుంచెద - నీస్థానమున
పాలన జేతును - నీకు బదులుగా

205. అయోధ్యయందున - కాలుమోపక
ఋషివలెనేను - జడలుధరించి
కందమూలములు - ఫలములు దినుచు
దినపక్షంబులు - నెలలుగడిపెద
నీపదములవి - శ్వాసమునుంచి
రాజ్య తంత్రములు - నేనడిపించెద
గటువుదాటిన - మరునిముషమున
నీవురానిచో - అగ్నిదూకెదను

### ❀ శ్రీరాముడు భరతునకు పాదుకలొసగుట

206. అనిపలుకుచు - ఆభరతుడంతట
రఘురామునికడ - సెలవుదీసుకొని
రాము పాదుకలు-శిరమున మోయుచు
తరలెనుతాను - బంధుజనులతో
జాహ్నవీనదిని - దాటిరందరూ
భరద్వాజముని - వాటికజేరిరి
జరిగినదంతయు - ఆమునివరునకు
విశదపరచెను - వినయము తోడ

207. మునివరునకు - భక్త్యంజలిసలిపి
యమునాతటిని - దాటిభరతుడు
శృంగిబేరమున - గుహునిజేరెను
దూరమునుండి - గాంచెనయోధ్యను
కుజ, గ్రహపీడిత - రోహిణీవలె
కృష్ణపక్షమున - రాతిరి యుంబలె
కాంతిహీనమై - వెలయునయోధ్యను
గాంచిభరతుడు - కడువిలపించెను.

❀ ***భరతుడు అయోధ్యలో ఉండజాలనని చెప్పుట.***

208. ఓగురువర్యా - మంత్రిసుమంత్రా
అయోధ్యనగరికి - అరుగజాలను
నందిగ్రామమున - నేవసియించెద
రామపాదుకలు - కొలువుననిలిపెద
ఛత్ర చామరము - లింపుగనిలిపి
అనవరతమునే - ప్రజల బ్రోచెద
రామునాజ్ఞనే - శిరమునదాలిచి
పటుతరభక్తితో - పాలించెదనసె

209. ముదముతోడ - ఆమౌనివసిష్ఠుడు
అభయమునిచ్చె - కైకసుతునకు
ముని వేషముగొని - వల్కలుదాల్చి
కనకపీఠమున - పాదుకలుంచి
ఫలపుష్పములు - మధురభక్ష్యములు
పరిపరివిధముల - అర్పణజేసి
పాదుకలకు - పట్టాభిషేకము
గావించెను ఆ - భరతకుమారుడు

### ❀ మునులు చిత్రకూటమును విడిచిపోవుట

210. చిత్రకూటమున - మునిసంఘంబులు
రామునిజేరి - ఇటులపలికిరి
ఖరుడనువాడు - రావణు అనుజుడు
కడునిర్దయుడు - నరభోజనుడు
మీరు ఇటకువ - చ్చినది మొదలుగ
పుణ్యాశ్రమముల - క్రతువులు జేయు
సమయమునందున - రక్తమాంసములు
హేయద్రవ్యములు - జల్లుచుండిరి

211. వనభాగముల - దాగినమునులను
తరిమితరిమి - వధియించుచుండిరి
మిగిలినవారిని - కడుహింసించుచు
వస్తుసంతతుల - భగ్నముజేయుచు
భయకంపితులను - జేయుచుండిరి
కావునమేము - యోచించితిమి
చిత్రకూటనగ - భూములువదలి
కణ్వాశ్రమము - జేరదలచితిమి

212. మునులపలుకులు - వినిరఘురాముడు
కొంతతడవుతా - యోచనజేసి
నేనిటనుండిన - ననుగన నెంచి
భరతుకుమారుడు - వచ్చుచుండును.
వ్రతభంగమునా - కగుటతథ్యము
చిత్రకూటమును - విడిచిపెట్టెదను
అత్రి మహాముని - ఆశ్రమంబును
చేరెదసీతా - లక్ష్మణుగూడి
అనినుడి వెను ఆ - మునుల తోడను

❀ ***శ్రీరాముడు అత్రిమహాముని ఆశ్రమంబుజేరుట***

213. సీతరాములు - సుమిత్రసుతుడు
మునివాటికను - జేరినంతనే
వందనమిడిరి - భవ్యచరితునకు
అత్రిమహాముని - ఆదరించెను
కన్నకొడుకులలె - గారవించెను
ఇల్లాలగు అన - సూయాసతికి
జనకాధీశు - తనూజనుజూపి
ప్రేమింపుమునిజ - పుత్రికవోలనే

### ❀ మునులు చిత్రకూటమును విడిచిపోవుట

210. చిత్రకూటమున - మునిసంఘంబులు
రామునిజేరి - ఇటులపలికిరి
ఖరుడనువాడు - రావణు అనుజుడు
కడునిర్దయుడు - నరభోజనుడు
మీరు ఇటకువ - చ్చినది మొదలుగ
పుణ్యాశ్రమముల - క్రతువులు జేయు
సమయమునందున - రక్తమాంసములు
హేయద్రవ్యములు - జల్లుచుండిరి

211. వనభాగముల - దాగినమునులను
తరిమితరిమి - వధియించుచుండిరి
మిగిలినవారిని - కడుహింసించుచు
వస్తుసంతతుల - భగ్నముజేయుచు
భయకంపితులను - జేయుచుండిరి
కావునమేము - యోచించితిమి
చిత్రకూటనగ - భూములువదలి
కణ్వాశ్రమము - జేరదలచితిమి

212. మునులపలుకులు - వినిరఘురాముడు
కొంతతడవుతా - యోచనజేసి
నేనిటనుండిన - ననుగన నెంచి
భరతుకుమారుడు - వచ్చుచుండును.
వ్రతభంగమునా - కగుటతథ్యము
చిత్రకూటమును - విడిచిపెట్టెదను
అత్రి మహాముని - ఆశ్రమంబును
చేరెదసీతా - లక్ష్మణుగూడి
అనినుడి వెను ఆ - మునుల తోడను

※ శ్రీరాముడు అత్రిమహాముని ఆశ్రమంబుజేరుట

213. సీతరాములు - సుమిత్రసుతుడు
మునివాటికను - జేరినంతనే
వందనమిడిరి - భవ్యచరితునకు
అత్రిమహాముని - ఆదరించెను
కన్నకొడుకులలె - గారవించెను
ఇల్లాలగు అన - సూయాసతికి
జనకాధీశు - తనూజనుజూపి
ప్రేమింపుమునిజ - పుత్రికవోలనే

**అత్రి మహాముని అనసూయ గురించి శ్రీరామునికి చెప్పట**

214. అటుపిమ్మట ఆ - రామునిగాంచి
మును ధర అంతయు - దశవర్షంబులు
అనావృష్టికి - గురికాబడెను
భూమిజనులునూ - సర్వజీవములు
తాపముచెందెడి - సమయమందునా
కాననమందున - ఘోరతపంబును
జేసి జలమును - ఫలమూలములను
సృజియించెనునా - సతి అనసూయయె

215. గంగాతటిని - నిష్ఠనుగైకొని
పదివేలేడులు - వ్రతములుసలిపి
అంతరాయముల - ఆవలద్రోసె
దేవకార్యమున - దశరాత్రములను
ఏకరాత్రిగా - జేసినఘనత
జగతినిపొందెను - ఈ సాధ్వీమణి
అసూయలేమిని - అనసూయ యనే
పేరును బడసె - వసుధయందునా
అని మధురముగా - అత్రిమహాముని
అనసూయగాథను - విశదపరచెను

216. రామునానతి - గైకొని సీతా
అరిగెనుసతి - అనసూయను జాడ
పరమవృద్ధయు - మహా భాగయు
ముడు తలుపడిన - తనువుతోడను
సకలసతులకు - ఆరాధితయగు
అనసూయాసతి - కంజలినొసగి
కుశలములడగ - జానకిలలనను
గాంచిపలికెను - కడుసంబరమున

※ *సీతాదేవిని అనసూయ కీర్తించుట*

217. రాజభోగములు - సర్వసంపదలు
బంధుజనమును - పరివారంబును
త్యజించినీవిటు - భర్తనుగూడి
సాధ్విధర్మమే - సొంతముబూని
కాననములకిటు - ఏగుదెంచుట
కడు అపూర్వము - పుణ్యవతులకు
నిన్నుబోలిన - కాంతలీధరణి
జన్మించగలే - రెందువెదకిన

218. నగరవాసియైన - విపినస్థుడైనను
ధనికుడైనను - నిర్ధనుడైనను
ఖలుడయినను - కాముకుడైనను
మగనాలికిపతి - దైవమీ ఇలను
అటులేపతికి - నిజసతికన్నా
వేరొకఫలము - లేదు ఈ భువిని
పూర్వృతావిగా - వారువసించుట
ధర్మబద్ధమని - నీ వెరుంగుమా

219. అనసూయాసతి - ధరణీజాతకు
పలుపలుహితములు - భోధజేసెను
తనయత్తయగు - కౌసల్యాసతి
వనములకేగెడి - సమయమందున
వివాహవేళను - జననినుడివిన
పతివ్రతలస - ద్గుణములు దెల్పెను
మరలవింటిని - మీసముఖమున
అనిసీతపలికె - ఆముని పత్నితో

❀ **సీతాదేవికి, అనసూయాసతి అమూల్య వస్త్రాభరణములొసగుట**

220. అనసూయాసతి - కోరికమీరకు
రాముని గుణములు - వివాహక్రమమును
రమ్యముగావ - ర్ణించిచెప్పెను
సీతాసతిపతి - సేవారతిని
బహువిధముల - అనసూయ బొగడెను
సీతకభీష్టము - ఏదియొ ఎరిగి
మంగళప్రదములు-మలినముబొందని
అమూల్యవస్త్రా - భరణములొసగెను.

221. కమలభాంధవుడు - పడమటజేరగ
సంధ్యాసమయ - విశేషములన్నియు
అనసూయాసతి - సీతకు జెప్పెను
మునినాధునిసతి - ఒసగినకాన్కలు
ముదముమీర - శ్రీ రాముడుగాంచెను
మువ్వురారాత్రి - ఆశ్రమంబున
విడిదినిజేసి - మరుచటి దినమున
మునిజనంబు - లాశీస్సులందుకొని
వెడలిరివారు - ఘోరాటవులకు